సచ్చిదానంద రూపత్వం
మాయా ఇత్యభిధీయతే ।

జాతం నాస్తి మృతం నాస్తి
నాస్తి జ్ఞానం కదా చన ।

ప్రపంచం నాస్తి సర్వత్ర
నాస్తి తత్కారణం సదా ।

పునః పునః వ్రపక్ష్యామి
సాక్షిర్నాస్తీతి నిశ్చయం

బాహ్య బ్రహ్మేతి నిశ్చిత
ఇతి వేదాంత డిండిమః ।

బహుదా తర్కవాదేవ
కిం ఫలం కిం గమిష్యతి ।

అజ్ఞాన నరకం సిద్ధం
అన్యమార్గాను వర్తవం ।

శ్రవణ మనన నిధి ధ్యాస
సమాధి భ్రాంతి లక్షణం ॥

బ్రహ్మ విశ్వద్వయం మిథ్యా
ఇతినిశ్చయమేనహి ।

శిష్యోర్నాస్తి గురోర్నాస్తి
నాస్తి జ్ఞప్తికదాచన ।

ఏతద్వాక్య నిబోధోయం
గురువాక్యే నలభ్యతే ।

ఏతచ్ఛ్రవణమాత్రేణ
విద్యావిద్యేచ నశ్యతి ।

సచ్చిదానందరూపం బదేమాయ
యని నిశ్చయించుమా నోబుద్ధింతా ।

పుట్టనేలేనపుడు చావనేలేదు
జ్ఞానమెన్నడులేదు కడునిశ్చయంబూ ।

కలవలెనుఈజగము కల్లయేనమ్ము
కలకుకారణమైన ఆత్మయేకల్ల ।

మరిమరీ చెప్పెదను మరినమ్ముకొనుము
సాక్షిలేనిదియనుచు మదినిశ్చయంచూ ।

బట్టబయలేబ్రహ్మమిది నిశ్చయించూ
వేదాంతసభలలో డిండిమలుకొట్టూ ।

తర్కవాదనలోన ఫలమేమికలదు
వాదులా నోటిలో బూడిదేవయ్యా ।

అజ్ఞానమధికమై నరకంబుసిద్ధం
ఇతర మార్గములన్ని యింతేనునిజము ।

శ్రీవణమననిధి ధ్యాసలన్నియునూ
సమాధిలక్షణముల విభ్రాంతులన్నా ।

బ్రహ్మవిశ్వమురెండు యనిలేనివన్నా
నిశ్చయించిన నిశ్చయంబే మాయన్నా ।

గురుశిషులిద్దరనె గుర్తులేవు
గుణములేమియులేవు గుర్తేమిలేదు ।

ఇట్టి ధృఢవాక్యములు దృఢమౌటకొరకూ
గురుసన్నిధినిజేరి మరితేలియవలెనూ ।

ఈ వాక్యములుమదిని ఇంపుగానిన్న
విద్యావిద్యలు రెండు లేకపోతాయి ॥

బ్రహ్మచారీ గృహస్థోవా
వానప్రస్థో యతిస్తువా

తేషాంనవిద్యతే జన్మ
ఇతివేదాంత జర్ఘరః ॥

యేమానవాః పఠిష్యంతి
బాహ్యరూపా భవంతివా ।

నిరాకాశం పరం బాహ్యం
అచలం పరిశిష్యతే ॥

అస్మిన్నర్థేవ సందేహం
సత్యం సత్యం పునః పునః

ఓం శాంతి శాంతి శాంతిః



బ్రహ్మచారైననూ గృహస్థుయైనా
వానప్రస్థైన తా యతియైనగాని ॥

ఈధర్మమదివిన్న జన్మరహితమనీ
వేదాంతసింహమిటు గర్జించుచుండె ।

యేమానవులుయైన యిది పఠన జేయ
బయలురూపమువలెను భద్రమౌతారు ।

నిరాకాశంబదే పరబయలునాన్నా
అచలపరిపూర్ణమని మదితెలియు తండ్రి ।

ఇటు తెలిసినయెడల సంశయములేదూ
ముమ్మాటికీ సత్యమిది సత్యమయ్యా ।

విరతమూ వరియించ నిత్యకైవల్యం
పదవినీపొందెదరు పలుకురహితముగా ।

ఓం శాంతిః ఓం శాంతిః ఓం శాంతిః
ఇట్లనంతోపనిషత్సూత్ర - ఆంధ్రం - ద్వివదవాక్యములు

శ్రీ అరట్ల రామారావుగారి విరచితము
సంపూర్ణము

సీ॥ శివరామదీక్షిత శిష్యుడప్పయటంచు । సీతరామస్వామి సేవకుండు
భాగవతులకృష్ణ యోగిభక్తుడుఫీలు । ఖానలక్ష్మణమూర్తి ఘనభటుండు
పగడాలవంశసం భవుడైనశ్రీవెంక । టేశ్వరగురుమూర్తి శిష్యవరుడు
నిర్మలానందశ్రీ నేతివంశాబుధి । వేంకటేశ్వరస్వామి కింకరుండు
తే॥ గీ॥ పూర్ణయానంద వాడపల్లాగయార్య
సద్గురుని సేవజేసెటి భక్తనంద
తూడి శ్రీ దేవమాంబను విశదముగను
దేశికులశాఖ నీరీతి దెలియరయ్య ॥

## మంగళహారతి



హారతి గైకొనుమా । శ్రీ అగయార్యా ॥హారతి॥

1. కర్పూర హారతి । కరుణతో గైకొను
కనుకమాంబపుత్ర । కార్యాకారణవర్జిత ॥హారతి॥

2. రానిపోనియట్టి । రాజామార్గముజూపి
మానిని రత్నమాంబకు। మహనీయ ప్రియుడావగుచూ ॥హారతి॥

3. ద్వాదశీషోడశి భావం । బోధలచే దృఢముగదెల్పి
బాధాలు బాపిన సద్గురు । వాడపల్లాగయార్యా ॥హారతి॥

4. అంతాటనున్నాయట్టి । అచలాపరిపూర్ణము జూపి
వంతాములన్నీ బాపిన । పూర్ణానందా నిజగురు ॥హారతి॥

5. భక్తానందాశ్రమ మందూ । ముక్తి భక్తులకూనిచ్చును మీ
సూక్తులు మదిని తలచుచూ । తూడి దేవమాంబాయిచ్చిన
॥హారతి గైనుమా॥



○ జై శ్రీ సద్గురు పూర్ణానంద అగయార్యప్రభు మహారాజ్‌కీజై ○

ఓం

శ్రీమద్గురు పూర్ణానంద
వాడవల్లి అగయార్య సద్గురు పరబ్రహ్మణేనమః

# ❋ బోధామృతము ❋

ఉ॥ శ్రీకర శిష్యమానవ వశీకృత సత్కృలు శాంతియుక్తుల
స్తోకదయాస్వభావులు సుశోభిత వాడపలాఖ్యవంశజుల్
భీకర సంశయానలవి భేదకమేఘులు రాజయోగుల
న్నేక మనస్సుతోడ నిపు డెంచెద సద్గురు లాగయార్యులన్॥

ఓ సజ్జనులారా!

ఈ ప్రపంచమున మానవుడు తాను జన్మించుటకు కారణమేమి? తా జేయు కార్యమేది? తా నెట్టివాడు? అను విషయములు ముఖ్యముగ నాలోచింపవలయును. జగత్తులోగల ఎనుబదినాల్గు లక్షల జీవజంతువులలో మానవజన్మ శ్రేష్ఠమైనది. ఎట్టులనగా? మానవజన్మము దప్ప మిగత జన్మములకు ఆహారము, నిద్రా, భయము, మైథునము నాచరింపుచున్నవి యీ నాలుగు విషయములు వాటికి నిత్యకృత్యములు. అయినా వాటికి విజ్ఞానదృష్టి లేదు. మానవునకి మాత్రము యీ నాలుగు విషయములేగాక విజ్ఞానదృష్టి గలదు. ఆ విజ్ఞానదృష్టి లేనివాడు పై జీవజంతువులలో నేకీభవించును.

మానవుడు తాను మాతృగర్భనరకానుభవము నుండి సూతికావాయు ప్రేరేపణచే భూపతనమయ్యె బాహ్యవాయువు తగిలనంతలో జ్ఞానముచెడి

నాపూర్వపు జ్ఞానమేది అని కావుకావున దుఃఖింపుచు పొత్తిగుడ్డలలో బరుండి తల్లియిష్టముసై సైన్యము గుడుచుచు ఆకలిదప్పులు చెప్పలేని స్థితిలో నుండి మలమూత్రములలో మునుగుచు చీమలుగరచినను-దోమలుగరచినను దురదనుగూడ బాపుకొన శక్తిలేక తన బాల్యావస్థనెట్టులోగడిపి కుమారత్వము (అనగా ఐదుసంవత్సరములు) తరువాత కొద్ది జ్ఞానముకలిగి తల్లిదండ్రుల కట్టుబాటులోచేరి విద్యాగురువువలన శిక్షింపబడుచు ఆటపాటలకులోనై తనకుతాను గుర్తెరంగు శక్తిలేక కాలము గడుపుచు పిమ్మట సకలమును తెలుసుకొనుటకు విజ్ఞానసాధకమునకు స్వతంత్రమైనదియు, సకలజీవులు కాపాడ సాధ్యమైన శక్తి (అనగా యౌవనము) ప్రారంభము కాగానే నాతల్లి-నాతండ్రిశక్తి నాయన్న-చెల్లెలనుచు ఆత్మగౌరవమునకు పాటుబడుచు మాయతంత్రములోబడీ దురాశాపీడితుడై పొట్టకొరకు అసత్యము-దయాశూన్యత ఇత్యాది దుర్గుణములతో జీవితము గడుపుచూ వచ్చిన తాతముత్తాతలు ఎంతసంపాదించినను వారివెంట గోచీగుడ్డకూడ పోలేదన్న సంగతి తెలిసి-తెలియనివాడగుచూ అవసరస్ఫూర్తిత కులమును-గోత్రమును నావారందరు-నాకున్నరని తలంచుచూ అన్యులను వేరుగాభావించుచు "రాజహంస గ్రీష్మఋతువు నందు ఎదడమావుల జూచి నీరున్నదనిదహము తీరునని భ్రాంతిపడినట్టు" సంసారమేమోక్షదాయకమనితలంచి మానవుడు అనేక భ్రాంతులకులోనై పుట్టి-చచ్చుచుండును.

పూర్వజన్మమున తాన జేసిన కర్మల విధికృతముగా ననుభవించి ఆకాశమునుండి వాయువు, వాయువునుండి అగ్ని, అగ్నినుండి జలము జలమునుండి పృథివి, పృథివినుండి ఓషధి, ఓషధినుండి అహారము-ఆహారముగా పురుషునియందు ప్రవేశించి భార్యాభర్తలసంయోగమున శుక్లరూపముగా-శోణితము లోగలిసి మాతృగర్భమున పిండరూపము ధరించును.

ఒకమాసమువరకు శిరస్సు యేర్పడును. రెండవమాసమున

కరచరణములు కలుగును. మూడుమాసములకు చర్మము-గోళ్లు-వెంట్రుక లు-నవరంధ్రము లేర్పడును. నాలుగుమాసములకు సప్తధాతువు లేర్పడి అయిదవమాసమున ఆకలిదప్పులు కలుగును. ఆరవమాసమున నాడులే ర్పడి ఏడవమాసమున జీవుడుకుదుటపడును. ఎనిమిదవమాసమున జీవునికి తెలివికలిగి తల్లిచేతినబడు మ ధు రా మ్ల క టు క షా య తిక్త మొదలగు రసములు తనదేహమునంటగా "కత్తికాటుపై కారముచల్లినట్లు" శరీరము బాధపడ, క్రిమికిటకములు తనను ఆహారముగా గొనచెప్పరానంత బాధ పడుచు, పూ ర్వ జ న్మ క ర్మ ల తలపోయుచూ తొమ్మిదిమాసములకు— నేను యీ రోతగర్భమున నుండలేనని, నాకు దిక్కెవ్వరులేరని, తన కులమును నిందిచుచు, నేపూర్వజన్మమున చేసినకర్మయే ఈగర్భనరకము ను అనుభవించవలసివచ్చెగదాయని దుఖఃచుచూ నేనిక యిట్టి దుష్కర్మల నాచరింపనని సుజ్ఞానివలె దుఃఖపడుచూ సూ తి కా వా యు పేరిరేపణచే అధోముఖుడుగావయ్యి జన్మించును.

ఇట్లు జన్మించి బాల్యా కౌమారావస్థల బొంది, యౌవనమున యువతిని వివాహమాడి, విషయాదులయం దాసక్తి కలిగి, విచక్షణలేక డబ్బు సంపా దించి, మేడమిద్దెలుకట్టి, యివే నా వైకుంఠమని, నాభార్య-నాపుత్రులు-నాబాంధవులు- అంతా నావారేనని భ్రమసి, నాకంటే అధికులెవరని గర్వముచే........

తానెచటికి పోవలయువను తలంపులేకున్నను తనను కదిలించి పరుగులు పెట్టునదేదోనని తెలియక ?

తన కవసరము లేనట్టిదానిలి కోరక ?

తనవారని, అన్యులని, సకలప్రాణులును తనవలెనని తెలియక ?

తన దురలవాట్లే సుఖమనితలంచి, మానాభిమానములు పోతు న్నందుకు విచారపడక ?

తన కొలువులోనుండి తానిచ్చు జీతముచే జీవిస్తూ చెప్పుపనులను సక్రమముగా చేయువానియందు విశ్వాసముంచక ?

వాయనా ఈ లోకములో ఎవరెంత సంపాదించినను ఒంటునున్నకు (౧౦) ముందునున్న పెడితె (౦౧౦) యెంతసంఖ్య పెరుగునో అంతే ఈ ప్రపంచమనీ నీదేదియులేదు, నీవెంటనేదియురాదు, ఇదినాది, అదినాదియని పెరిభ్రమల పడుతూ నానాయాతనలచే విచారించకయున్నావని చెప్పు పెద్దలను గౌరవించక వారియందభిమాన ముంచక, వారి అనుభవాలపై భక్తి విశ్వాసములు లేక ? రతియం దాసక్తుడై మురికిసంతానమును గాంచుచు, యీ మాయావృతమగు సంసారమే నిత్యానందమని యానంది ంచుచుండ ఇట్లు కొన్నాళ్లు గడిచినపిమ్మట, ఘోరవృద్ధావ్యము వచ్చును. అపుడు మంచమునజేరి మూడుకాళ్ల ముసలియై కన్నులుగానరాక-చెవులు వినిరాక-పండ్లురూడిపోయి పైకిదేలిన బీరునరములతో సూగులాడు చర్మముగలిగి రుచిదెలియక సకలం తినగోరుచు-జీర్ణించుకొన శక్తి లేక అవస్థబడుచు-పరులు తిట్టినను వినరాక యితరుల గుర్తించ చూపులేక సమస్త రోగములకు తానేనిలయమై మలమూత్రములనొదులు స్థలములో విసర్జించు శక్తి లేక ఉన్న చోటే విడుచుచు....దుర్గంధముతో గూడి....పరులు నిందింప....భార్యయేవగింప పుత్రులకు రోతజనింప బహు కష్టముల నొందుచు.... తుదకు కఫవాతపిత్తములు కంఠగతమై నాలుకాడలేక అవస్థ బొందగా మృత్యువు నోరువిప్పుకొని మ్రింగవచ్చువేళ నూరుతేళ్లుకుట్టిన యెంత బాధయగునో అంతబాధచే ప్రాణములు యీదేహమును వదలును.

అట్టి సమయమున యాశవమునుచూచి భార్యాపుత్రులు బంధువులు సేవకులు మిత్రులు శోకింతురు కాని బ్రతికింపజాలరు. ఈ మృతశరీరమును యింటనుంచుట కంగీకరించక వెంటనే కాల్చివేయుదురు లేదా పూడ్చి వేయుదురు.

గాన యిట్టి మాయా ప్రపంచమున జననమరణ ప్రవాహమును దాటుటెట్లాయని నిజభక్తులద్వారా గురుమహిమనెరిగి శ్రీ సద్గురుమూర్తి నాశ్రయించి నాలుగుశుశ్రూషణలొనర్చి (శుశ్రూషలనగా ౧ ఆత్మ ౨ అంగ ౩ స్థాన ౪ రసద్భావన) సద్గు నిపూజించి - సాధనసంపత్తి (అనగా ౧ నిత్యానిత్యవస్తువివేకము ౨ ఇహమూత్రార్థఫలభోగవిరాగము ౩ శమాదిషట్కసంపత్తి (౧ శమము, ౨ దమము, ౩ ఉపరతి, ౪ తితీక్ష, ౫ శ్రద్ధ, ౬ సమాధానము- గురుముఖతా) ౪ ముముక్షత్వము మోక్షము నందాపేక్ష కలుగుటే సాధనసంపత్తి) యని యెరింగి ప్రుపదేశమును బొంది......ద్వయమంత్రముల స్వీకరించి నిశ్చలమనస్కుడవై క్రమక్రమముగా

శ్లో॥ బ్రహ్మణోరవ్యక్తః అవ్యక్తోమహతః మహతః మహదహంకార
మహదహంకారాత్ పంచతన్మాత్రాణిపంచతన్మాత్రేభ్యో
పంచమహాభుతాని పంచమహాభూతేభ్యో అఖిలంజగత్ ॥

మొదలు బ్రహ్మము నిర్గుణముగా నుండెను. ఆ నిర్గుణమున యవ్యక్తమను పెనుమాయుబుట్టెను. ఆ పెనుమాయ యందు మహాతత్వముదయించెను. ఆ మహాతత్వమునందు అహంకారము గలిగెను. అహంకారమువలన త్రిగుణము లుద్భవించెను. త్రిగుణములందు పంచన్మాత్రలు కలిగెను. పంచతన్మాత్రల యందు పంచమహాభూతంబులుత్పత్తియయ్యెను. పిమ్మట యాకాశము రెంభాగంబులై యర్థాంశము తన నిజాంశము యుండుటచే మొదటి భాగము జ్ఞానమయ్యెను. రెండవ భాగము నాలుగుభాగంబులై వాయువును గలిసి మనస్సు, అగ్నినిగలసి బుద్ధి, జలమునుగలిసి చిత్తము, పృథివినిగలసి యహంకారములయ్యెను. యివి ఆకాశపంచక మంతరేంద్రియము లనబడును. వాయువురెండుభాగంబులై యర్థాంశము తన నిజాంశము యుండుటచే మొదటి భాగము వ్యానమాయెను. రెండువ భాగము

నాలుగుభాగంబులై యాకాశమునుగలిసి సమానము, యగ్నినిగలిసి వుదానము, జలము నుగలిసి ప్రాణము, పృథివినిగలిసి అపానము ఇవి వాయుపంచక ప్రాణేంద్రియము లనబడును. అగ్ని రెండుభాగంబులై యర్థాంశము తననిజాంశముయుండుటచే మొదటిభాగము చక్షువయ్యెను రెండవభాగము నాలుగుభాగంబులై యాకాశమునుగలిసి శ్రోత్రము, వాయువును గలిసి త్వక్కు, జలమును గలిసి జిహ్వ, పృథివిని గలిసి ఘ్రాణము. ఇవి యగ్ని పంచకజ్ఞానేంద్రియముల బడును. జలము రెండుభాగంబులై యర్థాంశము తన నిజాంశము యుండుటచే మొదటి భాగము రసమయ్యెను. రెండవభాగము నాలుగుభాగంబులై యాకాశమును గలిసి శబ్దము, వాయువునుగలసి స్పర్శ, అగ్నినిగలసి రూపము పృథివినిగలసి గంధము, ఇవి జలపంచక విషయేంద్రియములనబడును. పృథివి రెండుభాగంబులై యర్థాంశము తన నిజాంశము యుండుటచే మొదటిభాగము గుదయయ్యెను. రెండవభాగము నాలుగుభాగంబులై యాకాశమునుగలసి వాక్కు,వాయువునుగలసి పాణి,అగ్నినిగలసి పాదము, జలమును గలసి గుహ్యము. ఇవి పృథివి పంచక కర్మేంద్రియములన బడును. ఈ ప్రకారంబుగ ఇరువదైదు ఇంద్రియములుగలసి స్థూలశరీర (పృథివి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము- పంచభూతములు, వీటిలో నొకటొకటిపేరుగా పంచుటయే పంచీకరణము) మయ్యెను.

మనస్సు, బుద్ధి, ప్రాణేంద్రియములు, జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు యీ పదునేడు ఇంద్రియము గలసి సూక్ష్మశరీరమయ్యెను. స్థూలసూక్ష్మముల రెంటికిని జన్మ కారణమే. అవిద్య కారణశరీరమయ్యెను. స్థూలశరీరాభిమానియైన జీవుడు విశ్వుడనే పేరుతో నేత్రస్థానమున నిలచి జాగ్రతావస్థతో సకలవ్యవహారము లు జేయుచుండును. సూక్ష్మశరీరాభిమానియైన జీవుడు తేజస్సుడనే పేరుతో కంఠస్థానమున నిలచి స్వప్నావస్థలో మనోవ్యవహారము జేయుచుండును. కారణశరీరాభిమానియైన జీవుడు ప్రాజ్ఞుడనె పేరుతో హృదయస్థానమున నిలచి

సుషుప్త్యవస్థతో వ్యాపారశూన్యుడై యుండును. ఇట్టి యవస్థాత్రయ ములకు సాక్షియైన జ్ఞానమె పరమాత్మ. ఈ పరమాత్మ రక్తము, శ్వేతము, కృష్ణము, నీలము, యీ నాలుగింటి మధ్యలో తేజోమయముగా నుండును. కర్ణికాకారమై, సువర్ణరూపమై, పురుషుడై, శిఖియైయుండును ఇదియే సర్వసాక్షి, జ్యోతిస్సు, నీవారశూకము, మేరు శిఖరము, సహ స్రారము. వటబీజమై, కైలాస, వైకుంఠ సత్యలోకాదుల కాశ్రియ స్థానమై ప్రకాశించును.

నీలముయొక్క మధ్యమందునిలచిన బిందువు గంగానదియగును. ఆ నీలమే యమునా నది యయ్యెను. విద్యుల్లేఖయే సరస్వతినది యయ్యెను. ఈ ప్రకారముగ మూడు నదులగుచు నాదబిందు కళలు విచారించగా అకార, ఉకార, మకాము లయ్యెను. ఈ మూడు వర్ణము లేకమై ప్రణవరూపమగు ఓంకారమై, ఆ ఓంకారమే పరబ్రహ్మమై మండలమున వెలుగొందుచుండును. అంగలింగాకారమై, అంగమై మంగళంబగుచు కళలతో ప్రకాశించుచు, పావమై, సూక్ష్మమై, కారణము పైన ప్రకాశించుచున్న వస్తువ యెట్టిదో, యట్టిదానిని చూడదగిన మానవుడు, స్నానముజేసి శుభ్రమైన వస్త్రము గట్టుకొని, పరిశుద్ధమైన స్థలమందు కూర్మచక్రము లిఖించి, దర్భకృష్ణాజిన ధవళాసనములు బరచి దానిమీద పద్మాసనవరుడై కూర్చుండి కన్నులుమూసి వెన్నునిక్కించి కొనముక్కుయందు చూపునిలిపి తనకిష్టమైన మంత్రము జపించవల యును. దీనిని ధ్యాన్న మనబడును. ఱెప్పలు వాల్చక రెండు చూపులు భ్రూమధ్యమందు నిలిపి తర్జనలచే చెవులుమూసి, యంత రజ్జప్తిచే గజ్జ, మువ్వలు, ఘంటా, శంఖము, వీణ, తాళ, వేణు, భేరి, మర్ధళ, మేఘ యను ధశవిధ నాధములు విని మేఘనాధమందు మనస్సు లయముచేయవలయును. దీనిని రాధాయంత మనబడును. అంగుష్ట ములచే చెవులను, తర్జనమధ్యమములచే కన్నులను, అనామికములచే

ముక్కురంధ్రములను, కనిష్టకములచే నోరును, పాదములచే పాయూవస్థలను మూసి యాధారమునుంచి వాయువును లేపి క్రమముగ స్వాధిష్ఠాన, మణిపూరక, అనాహత, విశుద్ధ, అజ్ఞేయచక్రమునకు తెచ్చి భ్రూమధ్యమందు నిలిపి, చూపు, మనస్సు, వాయువుల నొకటి జేసి ధ్యానించుట షణ్ముఖి యనబడును. అరకంటిచూపు భ్రూమధ్యమందు నిలిపి చూడగాచూడగా చంద్రుడు, సూర్యుడు, అగ్ని, ఇంద్రధనస్సు, నవరత్నములు, నక్షత్రములు, మెఱుపులు, మంటలు, చీకటి, వండువెన్నెలకాంతి మొదలైన చిత్కళలు గనిపించి పోయినపిమ్మట బట్టబయలు గనుపడును. దీనిని శాంభవి యనబడును. ఇంతియేగాక నింకను యమ, నియ, మానస, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన, ధారణ, సమాధ్యష్టాంగ యోగములును, మంత్ర లయ, హఠ, రాజయోగములును, సాంఖ్య తార కామనస్కములును, ఆసనముద్ర లక్ష్యాఖ్యాపములును, జ్యోతిదర్శనమును, మహావాక్యార్థ, లక్ష్యార్థములు విన్న మానవుడు శాంతిపరుడగును– కాని పరమశాంతిని పొందలేడు. పరమశాంతినిబొందుటకు ద్వయమంత్రముల (ద్వాదశీ షోడశి మంత్రములు) చే పరిపూర్ణబోధ ప్రత్యక్షప్రమాణముగా నిట్లెరుగవలయును–

శ్లో॥ విద్యావిద్య అతీతశ్య । నిర్విద్యాశ్ఋణు పార్థిన
నిర్విద్యాశ్రవణ మాత్రేణ । సర్వభ్రమ వినశ్యతి॥

శ్లో॥ బ్రహ్మరూపం ప్రవక్ష్యామి । శృణు శిష్య వినిశ్చయం
నిశ్చయం నాస్తి ప్రవక్ష్యామి । ఇతి వేదాంత నిశ్చయం

అని శ్రీకృష్ణపరమాత్మ ఉత్తరగీతలో అర్జునునకు చెప్పిరి. ఇట్లే శ్రీమద్భాగవతకృష్ణ ప్రభువర్యులు కూడా కందార్థములలో

కం॥ శ్రీమత్సీతారామస్వామికృపన్ । జెప్పనయ్యె సదసద్రహితం
బేమిపదార్థమొదానినియీమహి । కందార్థములుగా యివివినరయ్యా

అని తెలవిచ్చిరి. కనుక ఈ శ్రీశివరామదీక్షిత సాంప్రదాయకులు,

సదసద్రహితమైన అచలపరిపూర్ణస్థితిపరులగుటకుగాను. ఏతద్గురువర్యులు శిష్యులకు ద్వాదశీ, షోడశి మంత్రద్వయములు యిచ్చి, దృష్టాంత దార్ష్టాంతముల చెప్పి-చూపించి, పరిపూర్ణసూచనను సూచించి, యెరుకను విడిపింతురు. మంత్రమూలములకు మంత్రన్యాసము వున్నది ఈ న్యాసమును నిజగురుముఖతా విమర్శించిన యెడల, కేవల అచలపరిపూర్ణ స్థితిపరులు అగుదురవి మద్గురు అగయార్య కరుణాకటాక్షవీణమున నా నమ్మకము. అది యెట్లనగా

కం॥ పుట్టుటగిట్టుటలేకను । పుట్టెగిట్టెటియెరుక
పోడిమెరుగన్ చట్టువలె । కదలకుండును....

అని గురువర్యులు తెలవిచ్చినారు. ద్వాదశీ మంత్రన్యాసములో కూడ శృతి, అచలఋషి, అవినాశశ్ఛందః, అభనోదేవత, అప్రమేయశక్తిః అని తెలవిచ్చిరి. అనగా.

ఈ అచలఋషి పుట్టుట, గిట్టుట అనే లక్షణములేనివారు. ఈ అచలమునకు, ఈ చావుపుట్టుకలు గల యెరుక అనగా యెరిగే స్వభావ లక్షణముగల జ్ఞానముయొక్క సంగతి యేమియూ తెలియనిదియై కేవల అవ్యక్తాక్షరపరబ్రహ్మమూర్తియైన శుద్ధవియత్ మూర్తియే అచల ఋషి. ఈయన నాశనములేని లక్షణముగల ప్రభువు, ఈయన సాన్నిధ్యమున కార్యరూపమైన అవస్థాత్రయ దేహేంద్రియాది ప్రపంచమున్నూ కారణరూపమైన మహాకారణశరీరమైన యెరిగే యెరుకైన ప్రత్యక్షర వరమాత్మలు లేవు. అనగా పిండాండమందు ప్రత్యగాత్మ, బ్రహ్మాండ మందు మహదాద్రమైత వరమాత్మలున్నూ లేవు. ఆ కారణమున ద్వయదోషరహితుడు అచలఋషి అని, "ద్వంద్వాతీతం" ధ్యానములో వాడుచుంటిమి. అనగా ఘటమఠొపాధులైన పిండ బ్రహాండోపాధి ద్వయదోషరహితమే బ్రహ్మానందం కేవల పరమ సుఖస్వరూపమైనది. ఇచ్చట ఓంప్రకాశ స్వరూప వరమాత్మ లేని కారణమున భాగవత కృష్ణప్రభువర్యులు

కం॥ వలుకునవలుకగరాకను । తలవోయుదమనిన । మదికి తగలక
యెపుడున్ । ములుగ్రుచ్చసందులేకను । కలిగున్నది । బట్టబయలు
గదరా మాయన్నా । ఇదిగోచూడు కదులాదోయన్నా....
అనిశెలవిచ్చిరి.

బట్టబయలై యున్న అచలఋషినే "సూక్ష్మాత్సూక్ష్మతరంనిత్యం తత్" అను న్యాయమున ముల్లుకొనకంటే సూక్ష్మాత్సూక్ష్మము కనుక ములాగ్రుచ్చసందులేక బట్టబయలై అంతటానిండి నిబిడీకృతమై యున్నది కనుకనే శ్రీకృష్ణపరమాత్మ

శ్లో॥ నైనం ఛిందన్తి శస్త్రాణి । నైనం దహతి పావకః
నచైనం క్లేదయంత్యాపో । నశోషయతి మారుతః

శ్లో॥ అచ్ఛేద్యోయమదాహ్యో । యమక్లేద్యోశోష్య ఏవచ
నిత్యస్సర్వగతస్థాణుః । అచలోయం సనాతనః ॥

అనిశెలవిచ్చిరి.

ఈ అచలఋషి సైనిచెప్పిన బట్టబయలు స్వరూపుడు గనుక అవినాశుడు అనగా నాశనములేని చందముకలవాడగుటచేత "అవినాశశ్ఛందః" అని న్యాసములో వున్నది. ఈయన యెరిగేశరీరమైన మహాకారణశరీరరహితుడు కనుకనే, నిజగురుమూర్తి అశరీరుడని చెప్పవలసి వచ్చెను. సర్వేసర్వత్రా నిండి నిబిడీకృతమై యున్నందున ఒక ఉపాధిలోనికి జొరబడేదికాదు. ఒక ఉపాధిలో నుండి వెళ్ళిపొయ్యేది కాదు, ఆ కారణమున "అభవోదేవ" దని న్యాసములో చెప్పబడినది.

ఈ అచలఋషి పిండబ్రహ్మాండశరీర ద్వయశక్తులైన జీవేశ్వర ద్వయశక్తులు లేనివారు. ఈ ద్వయశక్తుల అవసరము కించిత్తు లేని కారణమున ఈయనను అపరిమేయశక్తుడని చెప్పవచ్చును. ఉట్టి అశరీర అద్వయ, అవినాశ, అభవ, అపరిమేయశక్తియైన అచలఋషి నిజగురుగురు

మూర్తిని భక్తులైనవారు ప్రిభాతమున మనఃపూర్వకముగా ధ్యానించ వలెను.

" అమృతబీజం । అయమాత్మా
తత్వమశ్యాది । జ్ఞానరహితకీలకం "

బట్టబయలైన అచలఋషి సద్గురుదేవుడు పుట్టుటగిట్టుట అనే యెరుక యొక్క సహజలక్షణములు లేనటువంటి, " అమృతబీజుడు" అది యెట్లనగా ద్వైతమను పదమునుండి తీయుబడినదే "దేవతలు". ఈ దేవతలు బ్రిహ్మవిద్యకు మూలపురుషుడైన లేక శ్రీమన్నారాయణుని, ఈ అచలఋషినే నమ్మి భజించుచుందురు. ద్వైతులు, ఈ యననే అద్వైతులు "సత్యజ్ఞానానందస్వరూపుడు "కేవలజ్ఞానమూర్తి" "ఏకమేవాద్వితీయుడు" "నేతి నేతిమహావాక్యశేషితుడు" అని

శృతి॥ ఇంద్రియాణిపరాణ్యాహు । ఇంద్రియేభ్యః పరంమనః
మనసస్తుపరాబుద్ధి । యోబుద్ధేపరతస్తుసః
అనాహతస్య శబ్ధశ్య । తశ్శబ్ధశ్య యోర్ధ్వనిః
ధ్వనిరంతర్గతం జ్యోతిః । జ్యోతిరంతర్గతంమనః
తన్మనోవిలయం యాతి । తద్విష్ణోః పరమంపదం ॥

అను శృత్యానుగుణముగా యీ విష్ణువునే

కం॥ "పరమపద మనిని । బయులని గురుగుహ్య మనంతమని ।
న గోప్యంబనినన్ । పరిపూర్ణ మచలమనినను । తిరుమనగా
బట్టబయులు । తెలియమాయపొ్ప...."

అని శ్రీమద్భాగవతకృష్ణప్రవవర్యులు కందార్ధములలో సెలవిచ్చిరి.

ఈ పరమపదమైన విష్ణువునే విశిష్టాద్వైతులు వాసుదేవుడని నమ్ముచూ "ఓంనమోభగవతేవాసుదేవాయ" అను ద్వాదశీ మంత్రిముచే నిరంతరం మననము చేయుచూ పరమామృత తత్వమును అనుభవించుచూ

దేవతలని, అనిమిషులని, ఆనహంకారులని అశరీరులని సనాతనఋషాృదుల చేత స్తుతింపబడుచుండిరి. ఇట్టి పరమృతత్వ బోధామృతమే యీ జనన మరణములనేటి ఝుడుపును మాన్పె బీజమైయున్నందున మన ద్వాదశీ మంత్రన్యాసములో "అమృతబీజమని" శ్రీసాందీపమహాఋషివర్యులచే శ్రీకృష్ణపరమాత్మకు చెపబడినట్లు అనుష్ఠానంత్యముప చెప్పబడుచున్నది.

సకలసామర్థ్యములూ సకలనామరూపక్రియలూ సృష్టికి పూర్వమందు అద్వితీయమై నామరూపక్రియలు ఏమీ లేకయున్న బట్టబయలందు కలవలె తోచబడినవి. అందుకే కందార్థములలో

కం॥ ఆకాశాధిక భూతానీ కాత్మకమగుచు । యెరుక యీ జగ
మయ్యెన్ । రాకడపోకడ దీనికి ప్రాకటముగ దేనిలోనో ।
బట్టబయలదిరా....

అని కృష్ణప్రభువర్యులు సెలవిచ్చిరి.

ఆ కారణమున మహాకాశపరబ్రహ్మమైన నిశ్చలాత్మకు యే సామర్థ్యములూ లేవు. దీనికి కామక్రోధాది అరిషడ్వర్గములు లేవు. ఇటువంటి పరమామృతతత్వమునే గురుడని బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు సహా మొక్కిరి అందుకే కందార్థములో కృష్ణప్రభువులు

కం॥ సామర్థ్యమేమి చూపదు । కామ క్రోధాదికములు కలియ ।
దనిశమేదాములెరుగదు । యితరులు యేమనినను । మారు
పల్కాదీ బట్టబయలూ ॥ దీనికెమొక్కెదితరాజేజేలు ॥
నామరూపక్రియ నటనాలన్నియుమీరి । యేమనియనరాక ।
యేకమైయున్నది ॥

అని శెలవిచ్చిరి.

ఇదియే ''అయమాత్మ" అనగా ''ఈయాత్మ" ఈయని అను

నప్పుడు బోధకుడు తన హృదయముమీద చెయ్యినిపెట్టి ఈ ఆత్మే బ్రహ్మ మని చెప్పును. అప్పుడు ఈ అవస్థాత్రయ సాక్షిస్వరూపమైన ప్రత్య గాత్మే ఆ పరబ్రహ్మమని చెప్పును. ఈ ధర్మము ను మన అచల ఋషి సాంప్రదాయకులు యెట్లు అర్థమును చేసుకొనవలెననగా

ఈ అవస్థాత్రయ దేహేంద్రియాదికశరీరమును ఘటముగా నున్నా అనగా కుండగానున్నా యిందులో సాక్షియైన ప్రత్యగాత్మను శబ్ద ప్రకాశ అవకాశమైన ఆకాశముగానున్నా

బ్రహ్మాండ ఈశ్వర మరుపుదేహమైన విరాట్ హిరణ్యగర్భ అవ్యాకృ తులను మఠముగాను అనగా ఇల్లుగాను, ఇచ్చట ఈశ్వర మరుపు దేహము లను విమర్శించెదను. విశాలమైన బాండాకారముగా వుండి పంచబడిన లేక విశాలముగా విడబడి ఒక్కొక్క భూతమునకూ వర్ణగుణ శక్తిబీజ అధిదేవతలతో కూడున్న పంచీకృత పంచమహాభూత జగత్తే ఈశ్వరుని స్థూలదేహమైన విరాట్శరీరము.

ఇక ఈశ్వరుని సూక్ష్మదేహమైన హిరణ్యగర్భశరీరము పంచ తన్మాత్రలతో కూడుకున్న సూర్య, చంద్ర, నక్షత్ర, అష్టదిక్పాలక నవగ్రహ, సప్తఋషి,ముప్పైమూడుకోట్ల దేవతామండలములతో కూడు కున్న సూర్యుడు సంచారముచేసే అవకాశముమైన ఆకాశమునకు సూర్యా కాశమని పేరు. దీనినే నిర్వయాకాశమనికూడా పలుకుదురు.

పై రెండు జగత్తులూ విడబడుటకు కారణము మూడాహంకృతు లకూ మూలమైన మహదహంకార గోళమే. ఇచ్చట నుండియే తత్వ ములు విడబడుటకు కారణమైనందున దీనినే తత్వాకాశమని, యిదియే ఈశ్వరుని కారణదేహమైన అవ్యాకృతమని చెప్పబడినది. ఇదియే ఈశ్వరునకు ఆలయమైనది ఈ ఆలయమునే మందిరము లేక మఠమని యనవచ్చును. ఇట్టి మఠములో కార్యకారణాత్మకమై సర్వత్రా నిండి నిబిడీకృతమై మహద్రూప ఓంప్రకాశావరణా రూపమై హకాంసకార రూపమైన దహరాకాశము వున్నది.

కనుక పైని చెప్పిన ఈశ్వర శరీరత్రయసాక్షియే మఠములోగల గగనము. దీనినే మఠాకాశమని ఈశ్వరుడని యందురు.

ఇట్టి మఠాకాశమునకు అవతలగల మహాకాశీగావున్న బట్టబయలైన మహాకాశమునకు ద్వయావరణలవల్ల అనగా మఠ, ఘటములను రెండు అవరణల కారణముచేత ఘట, మఠాకాశములని పేర్లు కలిగెను. వీటినే జీవేశ్వరులని యందురు. ఇట్టి ద్వయావరణా దోషరహితమే తుర్యవేద సారాంశమైన "అయమాత్మా బ్రహ్మ" మను మహావాక్య లక్ష్యార్థము. ఇదియే అచల ఋషిగురుప్రభువు.

ఈ పై విచారణనుబట్టి శ్రీశివరామదీక్షిత అచలఋషి ప్రభువర్యులు ద్వయావరణాత్యాగమే అ చ ల ఋ షి శే వ య ని "యేరుకలేక సేవింపదగును" అని తెలవిచ్చిరి. ఈ ద్వయావరణలలో గల హిరణ్మయ వర్ణావరతోగల ఈశ్వర చైతన్యమునే గుర్తెరిగే శరీరమని శ్రీశివరామ దీక్షితప్రభువర్యులు తెలవిచ్చిరి. ఇచ్చట బంగారు వర్ణావరణయే యెరిగే శరీరము దాని అంతరమందుగల స్వయంప్రకాశ జ్యోతినే గుర్తని జతపరచి మొత్తంమీద గుర్తెరిగే శరీరం పరిపూర్ణమైన మహాకాశ బట్టబయలులో మూలంలేక తోచినది యెట్లనగా? క ల వ లె న ని దృష్టాంతముచే లేనని మేలుకొని నేలేకపోవలెను ఈ నేనే నేనను ఈశ్వర చైతన్యమే "తత్వమశ్యాదిజ్ఞానము" దీనిని అచలఋషినిజగురు పరబ్రహ్మవలోకనజేసి దృష్టద్రాష్టాంత రీత్యా రహిత పరచుటయే యేరుకలేక సేవించుట. ఇదియే త త్వ మ శ్యా ది జ్ఞా న రహిత కీరకం. తరువాత ద్వాదశీమహామంత్రిన్యాసాంతమున

"అఖిలకాలేషు పరిపూర్ణమస్తి । మాయాసహిత
మేతత్ ప్రపంచాదికం నాస్తీతినిశ్చయసిద్ధ్యర్థం
ద్వాదశాక్షరీ మహా మ ం త్ర జ ప ం క రి ష్యే"

భూతభవిష్యద్వర్త మానకాలమున్నవి - తానైన అచల పరిపూర్ణ కేవలాత్మకు లేవు. భాగవతకృష్ణప్రభువర్యులు

కం॥ "యేవరిపూర్ణము మేనికిలోపల వెలినిండియుండు । లోపము
లేకన్। అపరిపూర్ణమే జగతికిలోపల వెలినుండు । దానిలోనే వున్న
విరా ॥ పైరెండెవ్వీ లేనీవెన్నకురా ....''

అని తెలవిచ్చారి.

అనగా ఈ మూలంలేని గుర్తెరిగే శరీరమైన లేని నేనను హిరణ్మయ వర్ణావరణతో కూడుకున్న, మహద్రూప ఈశ్వర సర్వసాక్షి, శరీరములోన, వెలుపల కూడ నిండి నిబిడీకృతమైనదే తానైన అచల పరిపూర్ణ కేవలాత్మ ఈ తానే "అయమాత్మా బ్రహ్మ'' దీనికి భద్రాద్రిరామశతకములో

సీ॥ స్వచ్ఛమై సత్యమై స్వప్రకాశంబునై । అవరోక్షమైన సదా
అమలమగుచు । అద్యంతరహితమై అచలమై నిత్యమై ।
శుద్ధమై బుద్ధమై సిద్ధమగును । నిర్వ్యాజమైనట్టి నిర్గుణం
బయమాత్మ । పదముకు లక్ష్య తాత్పర్య మిదియ । ప్రతి
లేనిదై నిరుపద్రవంబై స్వతః । పరిపూర్ణమై బట్టబయలు
సగుచు ॥ జగదధిష్ఠానమై చరాచరములందు । బాధితము
లేక యున్నదే బ్రహ్మమగును ॥ రమ్యగుణధామ ॥

దీనికే ''తాను" అనే పదప్రయోగముచేసి భాగవతకృష్ణప్రభువర్యులు

కం॥ నేనెవ్వడనను జీవుడు । నేనే నేనను శివుడు । ఈ రెండన
కన్ । తానుండుఅచల.... మని తెలవిచ్చిరి.

ఈ తాను పదప్రయోగముతో శ్రీ సచ్చిదానంద వేంకటేశ్వర అవధూత ప్రభువులు సద్గురుభక్త శతకములోగల కందార్థములలో

కం॥ "తానే అచలము యనినను । తానే పరిపూర్ణమని । తానే
బయలౌ । తానే దేవుడుయనినను । తానే పరతత్వమనినా

తానేతానౌను । సర్వముతనకు తానేతానౌను । జ్ఞానాజ్ఞాన ప్రజ్ఞాన సత్యజ్ఞాన ధ్యాన నిధానసంధానములు లేక । తానే తానౌను॥ అని శెలవిచ్చిరి.

ఆ కారణమున చలించని లక్షణము కలవాడై, నాశనరహితుడై పిండ బ్రహ్మాండ జగద్విలక్షణుడై, అదినేనై తిని-నేనేఅదియైతిని అన్నటు వంటి అవస్థాత్రియ సాక్షి జ్ఞానరహితుడైనటువంటి వరమపురుషుడైన అచలపరిపూర్ణ కేవలాత్మయే మహాకాశవరశివ స్వరూపము. ఇదియే గగన సదృశమై నేను-నేను అను యెరుక పుట్టకముందు పుట్టిననూ-గిట్టిననూ తిరమైయున్నది. దీనిని విచారజన్యాభవజ్ఞానముచే భావించి యీ తెలిసిన తెలివినీ తెలివితోకూడుకున్న ప్రపంచమునూ షోడశీ నిజ గురువాక్య దృష్టాంత దార్ష్టాంత రీత్యా లేనినిశ్చయము లేక కలుగుటకు గాను మంత్రోపాసన చేయవలెను. మంత్రోపాసన దేనికనగా

"ఉపాది ద్వయదోషరహితార్థ ముపాసితవ్యం"

అను ఆర్యశృతి ననుసరించి భాగవతకృష్ణప్రభు కందార్థములలో బోధ దృఢీకరణములో

కం॥ రానివిపోనివి బయలని । లేనిది యీ యెరుక యనుచు । లె
స్సగ ధృడమౌదానుక । నీవీ మంత్రము మానక జపియించు
చుండు । మా నీతిశాలీ । లేనిదిలేదు మరువాకీజోలి ॥ లేనీది
లేదానిపూని నిశ్చయమైతె తానొక్కటుండు । గానియెట్లన॥
వినుమా నీతిశాలి ॥ అని శెలవిచ్చిరి

అందుకే కందపద్యములలో

క॥ బయలనిస నిత్యవస్తువు । బయలన నొక రీతినుండు బ్రహ్మాండములో
బయలనిన కండ్లబడనిది। బయలన బ్రహ్మాండమవల బరిగెడిదిసుమీ
అనిమ్మా

క॥ పరమపురుషుడీ బయలని । గురువరుడెరిగించిచూచి గొప్పకురుచలై
యెరిగెటి నినునేమృషనని ।యెరిగగరుగుమునీపె మాయవికపుట్టవిలన్

మొత్తము మీద ద్వాదశీన్యాసము యొక్క అర్థమును విచారించగా "తత్వమశ్యాది మహావాక్యార్థ । లక్ష్యార్థ। బ్రహ్మైక్యానుసంధాన। నాదబిందు కళాతీత । అద్వయ । అవాత్య । అచింత్య । అవ్యయ । నిత్య । శుద్ధ । బుద్ధ ప్రిజ్ఞాన । ఘన । నిర్వకల్ప । నిర్వచన । నిరుపమ । నిర్గుణ । నిరవయవ। నీరంధ్రి నిర్విశేష। నిరుపద్రవ। నిషిద్ధ। నిష్కర్మ నిష్కళంక ॥ నిరాభాస సర్వవికారసూన్య సహజామనస్క స్వభావుడైన అయమాత్మాబ్రహ్మ మహావాక్యలక్ష్యార్థమే. అచలఋషి సద్గురుమూర్తి అవినాశశ్ఛందుడు । అభవోదేవుడు । అమృతబీజుడు । అప్రమేయశక్తుడు । ఈయనను సేవించుటకు తత్వమశ్యాది జ్ఞానరహితము చేయుటే ఈయన సేవ అనగా శిష్యునిరహితము, లేక చతుశ్శరీరరహితం । దీనికే భాగవత కృష్ణప్రభువర్యులు "గురువాక్కుచేత" అను పదప్రయోగముచేసి చతుశ్శరీర రహితము జేసిరి. అది యెట్లనగా

కం॥ మరువన తొలమేనులు మూ। డెరుకన నాల్గవశరీర మీ రెం
డొకటే । పరిపూర్ణమువలిది । యీవలి యెరుకను । గురువాక్కు
చేత యెగరాజిమ్మినమూ ॥ పోవునులేనిదెరిగెదేగిననూ ॥ యెరి
గేదేలేకుంటె । యేమోఆవలిజాడ । యింతేచాలెరుకా నిట్లెగ
రాజిమ్మిననూ । పోవునులేనిదెరిగెదేగిననూ ॥

ఇదియే సద్గురుమూర్తి కరుణచేత తెలుసుకొని ఆర్యులైన పెద్దల అనుభవవాక్యములను విని కని విమర్శించిన ద్వాశీ మహామంత్రన్యాస విచారణ. ఇదియైననూ అరమరలేని సద్గురుమూర్తి ముఖతా విచారించవలెను.

ఇతి

శ్రీ సద్గురు పూర్ణానంద వాడపల్లి అగయార్య నిజగురు కరుణాకటాక్ష
విమర్శనారూప భక్తానంద తూడి దేవమాంబ విరచిత
ద్వాదాశీమహామంత్రన్యాస విచారణ
— సంపూర్ణం —

ఓం
శ్రీనిజగురువేన్నమః

అశ్య శ్రీనిరుపమాన షోడశాక్షరీమహామంత్రస్య । నిరంజనఋషి ః నిర్హాంకారనిశ్చందః । నిరామయ నిరాకాశోదేవతా । నిరావరణ బీజం నిస్త్రైగుణ్యశక్తిః । నిర్గుణప్రజ్ఞానరహితకీలకం । నిఖిలకాలేషు మాయా రహిత షడ్భూతరహిత నిశ్చయసిద్యర్థం । షోడశాక్షరీ మహామంత్ర జపంకరిష్యే ॥

మొదటి ప్రకరణములో విచారణవల్ల తేలిన అచలఋషీ సద్గురుమూర్తి విష్ణువని శృతిచేత చెప్పబడినది. అట్టి విష్ణువు గురుకృపచే తానెరిగిపోతే మిగిలిన నిశ్చయమేదో అదే శ్రీమద్రాజాధిరాజ మహారాజయోగీంద్రచంద్రులైన భాగవతకృష్ణప్రభు నిశ్చయమని భద్రాద్యంకితములో తెలవిచ్చిరి.

కం॥ అలభద్రాచలమనిన । బయలుగాగుర్తెరుగలవలయు । యెరుకను విష్ణ్వందులదోచి । గురుని కృపచే నిలువక విష్ణ్వెరిగిపోతే । నిశ్చాయమదెరా ॥ కృష్ణదాసు నిశ్చాయ మదెరా॥ యిలమీద యెవరైన । యీ కందార్థముల । లోపలిగూడార్థము । తెలియ । భ్రమనుజెందరువారు । నిశ్చాయమదెరా । కృష్ణదాసు నిశ్చాయమదెరా ॥ అని తెలవిచ్చిరి.

ఇది సంపూర్తిగా యెరుక మాలిన స్థితి, ఈ స్థితి కుదురుటకు శ్రీ కృష్ణప్రభువర్యులు

కం॥ యెరుకేకోశములై దెరు । గెరుకే భూతముల । నెరుగు । యెరుగును సర్వం । బెరుకే యెరుక నెరుంగును । యెరుకను గుర్తెరుగ । వేరె యెరుకా వున్నాదా ॥ వున్నాదంటె నరకామెకాదా ॥ నిరతాము గురుశేవ పరతంత్రులగుచు । తత్కరుణకు పాత్రులై యెరుకమాలినవారి । కెరుకవున్నాదా వున్నాదంటె నరకామోకదా॥ అనితెలవిచ్చిరి॥

ఇందులో సర్వమూ గురువై రగుచున్నది. యీ నేననే యెరుకే. ఈ యెరుక నిరతమూ గురుసేవచేయుచూ పరతంత్రములో గురుకరుణచే యెరుకఘూలును అనగా లేకపోవును.

ఇంతవరకూ మొదటి ప్రకరణములో అచలఋషినిజ గురుమూర్తి శేవ నాల్గుగు శరీరముల రహితముగా చేస్తిమి. అనగా యెరిగేయెరుక లేని అచలఋషిగురుస్థానము సలకరించితిమి. ఇదియే శిష్యుడు గురుడయ్యెను. ఈ విధానముగా పరధర్మమును యెరిగిన ప్రతిభక్తుడూ గురుడు కావలెను. అతడే పూర్ణుడు. ఈ మాటయొక్క అభిప్రాయము చాలా గంభీరబోధ లక్ష్యార్థహృదయము. కలవారలకే యెరుక. ఇది గురుశిష్య విచారజన్యానుభవజ్ఞులకే యెరుక.

ఇట్టి ఏకమేవాద్వితీయస్థాన మలంకరించిన పూర్ణుడు నివ్వరిముల్లు కొనంత సూక్ష్మము తన స్వరూపమని భావించి, ఇట్టి తానుతానైన తత్పదమునుంచి కేవల అమలనిర్గుణాతీత నిష్పత్తియోగిక పరిపూర్ణ పర బ్రహ్మమైన పరాకాశావలోకన జేయవలెను. అనగా పూర్వమేవ నిరాలంబం అను పరిపూర్ణ అచల ధ్యానశ్లోకరీతిగా నాలుగుదిక్కుల మూలలనడుమ మీదక్రిందా అంతటా నిండి నిడికృతమై యున్నదే వుత్త బట్టబయలైన నిరంజనఋషిని అవలోకించవలెను.

తరువాత నిర్హంకార నిశ్చందః అనగా శబ్దములు రెండుతకములు దీనికి వేమనాచార్యులు కంచుగంటానాదము. బంగారునాదమని కించిజ్ఞత్వ, స్వర్వజ్ఞత్వములకు చెప్పిరి. హిరణ్మయ వర్ణావరణలో నాదము కంచుగంటానాదము. అవ్యక్తాక్షఋషిలో నాదము బంగారు నాదము. ఈ నాదమే అహం. ఇట్టి అహ అనహ ద్వయములో ఏ అహమూ ఈ నిరంజనఋషిలో లేనికారణమున 'నిర్హంకార నిశ్చందః' అని ఆర్యులనిరి.

"నిరామయ నిరాకాశోదేవతా" అనగా అవ్యక్తాక్షర పరబ్రహ్మ

మైన అచలఋషి సూక్ష్మాత్సూక్ష్మతరమైన చిన్న స్వయంప్రకాశ అవకాశమున్నది. పైన చెప్పిన నిరంజనఋషియైన వృత్త బట్టబయలులో ఈ సూక్ష్మాత్సూక్ష్మమైన చిన్న అవకాశముకూడా లేనికారణమున నిరాయము నిరాకారోదేనత అని ఆర్యులు పల్కిరి. అందుకే కందార్థముల క్రమములోకూడా గురుశిష్య అన్యోన్య సందర్శనం అయిన తరువాత అచలలక్షణం. యెరుకలక్షణం, యెరుకోత్పత్తి లక్షణం, యెరుకను విడిపించు లక్షణం, మతాల లక్షణం అయిన తరువాత పరిపూర్ణబోధఅని తెలవిచ్చిరి. ఈ పరిపూర్ణబోధలో మొట్టమొదటి కందార్థములో కేవల అమలనిర్గుణాతీత అచలపరిపూర్ణపరబ్రహ్మమైన పరాకాశ సూచనను అచలఋషి సద్గురుమూర్తి సూచించెను. అదియెట్లనగా

కం॥ ఈపుత్త బట్టబయలును నీ విప్పుడు వుండజూచి । నిజముగ
యెరుకన్। నీవని నేనని జగమని భావింపుము। పిదప దీన్ని
బాయుమనిశమున్ ॥.... అని

పరిపూర్ణసూచనచేసి ద్రిష్టాస్వరూపుడైన తననూ దర్శనరూపుడైన శిష్యునీ, దృశ్యస్వరూపమైన జగత్తుని లేనిదని విడువుమా అని

"నిరావరణబీజం" అరగా కృష్ణప్రభువర్యులు "ఆవరణమునాకస" మని తెలవిచ్చిరి. ఇచ్చట స్వచ్ఛమై సత్యమై స్వప్రకాశమైన మహాకాశమే అవరణ. ఇట్టి అవరణమునే ఆకాశ మని తెలవిచ్చి "నిరావరణము నచలమనుచు యనిరి మహాత్ముల్ । అవరణముమితిగలిగిన । దావరణములేంటి । అమితమనితెల్పుకోరా । యీరెంటిన్ని వేరనికనుక్కోరా" అని తెలవిచ్చిరి. కనుక "నిరావరణబీజం" అని న్యాసములోవున్నది.

"నిస్త్రైగుణ్యశక్తిః నిర్గుణప్రజ్ఞానరహిత కీలకం" అనివున్నది.

పైని చెప్పిన నిరావరణబీజమును భావించి. అభ్యాసకుడు తనలో గల సర్వసత్తారహితుడై విస్పృహా భావయుతుడై తానైన నిర్గుణమైన శుద్ధవిజ్ఞప్తి మాత్ర తెలివినికూడా, పూర్ణావలోకనలో, రహితపరచవలెను.

అది యెట్లనగా నీవారు మల్లుకొనంత సూక్ష్మము తన రూపమని భావించి పూర్ణబ్రహ్మవలోకనలో "ఈ శుద్ధవియద్భ్రావ స్వప్రకాశము కించిన్నాస్తి" యని "యేతన్మిథ్యాశుద్ధవియత్ కించిన్నాస్తి" అని నిర్గుణప్రజ్ఞానరహితము చేసుకొని దాృష్టాంతరూపమైన కర్పూరదీప ముఁను భావించి శుద్ధ కర్పూరశిఖవలె అవగా అది పోవనున్న చిన్నకర్పూరశిఖ యట్లు తారహితము కావలెను. ఇటువంటి అతీతస్థితి కలుగుటకు ఈ అరూఢములో మంత్రమననము శ్రీకృష్ణప్రభు శెలవిచ్చిరి అదియేయుక్తి మంత్రము

కం॥ మరుపుసుషుప్తి మరణము। పరిపూర్ణమునకు సాటిపరచీ।
మరి యెరుకకున్ యాది మేల్కపుట్టువు నిరుదెరగుల నెరిగీ
యెరుక నెగరాజిమ్మోయి ॥ అపైనుండే దెరిగేదెట్లోయి। గురు
మంత్రమిదె । సుమ్మి మఁరువాకయేప్రొద్దు । స్మరణా జేసితి
వేనితిరిగిపుట్టవు నీవిట్లెగరాజిమ్మోయి॥ అనిశెలవిచ్చిరి

కనుక ఓ శ్రీనిజగురుమూర్తి మీ స్థాయినొంది హాయినొందుటకు మిమ్ము భద్రమైన అనగా జాగ్రతలో గఁరుజాగ్రతయే ఈ పుఁటబయలే భద్రాచలముగాదలచి అవ్యక్తాక్షరపరబ్రహ్మమైన విషువనునిర్గుణప్రజ్ఞానరహితమె నిజద్వాదశీ గురువ్యాయముఁ కనుక ఇది గఁరుకరుణ చొప్పున దొరుకును గాని ఊరికే అబ్బదు. అందుకే ప్రభువులు

"ఉపచారములు చేయుచుండఁము గురునకు గురుకృపలుగా।
కీలిదేలేక । యెరుక తాతొలుగా...." గాన

చచ్చుదాక నిద్దురవచ్చుదాక యభ్యాసము జేసితే జననమరణ దుఃఖము తప్పును. ఈ తెలిసిన తెలివిచేత తప్పతీసుటే తర్వాత తిప్పలు లేదు గనుక అభ్యాసములేదు. అరూఢస్థితి కలిగినవాడు పరమశాంతిపరుడుగును. ఇదియే పరిపూర్ణబోధ. ఇంతకన్న మరేమియధికము లేదు బోధస్థితిని బొంది సాధువులచే గలిసియుండి యెవరైనాయధికారులడిగినచో

వారిమనస్సుజూచి చెప్పవలయును. గురుసార్వభౌముని సేవ నిశ్చయ ముగాచేసిన జయమందుదురు గాన భక్తులకు ఇదేనా హెచ్చరిక.

ఈ ప్రకారము సద్గురు నాజ్ఞమీరక పరిపూర్ణచింతన జేయుచున్న మానవునికి జననమరణభ్రాంతి తొలగిపోవును.

ఇది నా సద్గురుమూర్తి కరుణాకటాక్షముచే విన్నకన్నమార్గము విన్నవించి ముగించుచున్నాను.

ఇతి

శ్రీ సద్గురు పూర్ణానంద వాడపల్లి ఆగయార్య నిజగురు కరుణాకటాక్ష విమర్శనారూప భక్తానంద తూడి దేవమాంబ విరచిత

— సంపూర్ణం —

శ్లో॥ ఓంఅస్యశ్రీ గురుగీతామాలామంత్రస్య భగవాన్ సదాశివఋషిః విరాట్ఛన్దః శ్రీగురుపరమాత్మా దేవతా హంబీజం। సఃశక్తిః సోఽహంకీలకం, శ్రీగురుకృపాప్రసాద సిద్ధ్యర్థేజపేవినియోగః॥

తా॥ ఈ ప్రకాశములగు గురుగీతలయొక్క మాలయనెడి మంత్ర మునకు సర్వమంగళస్వరూపుడై సర్వాతీతుడగు పరమాత్మయే ఋషి, బ్రహ్మాది సర్వరూపుడై ప్రకాశించెడి విరాట్టే ఛందస్సు, ప్రకాశమాన మగు సద్గురువను పరమాత్మయే దేవత, జీవుడే బీజము, ఈశ్వరుడే శక్తి, జీవేశ్వరులయొక్క కూడికయే పరమరహస్యము, ఇటువంటి ఈ మంత్ర మునకు ప్రకాశమగు సద్గురు కృపాసాక్షాత్కారము కొఱకైన అనుష్ఠాన ము చేయవలయును.

## —* గృహస్థధర్మము *—

ఉ॥ సంతసమొందు డెందమును। సౌధముబంధు సుతాదివర్గమున్
మంతనమందు ప్రేమనిడు। మానిని సేవకు లిచ్ఛపూర్తి శ్రీ
మంతము, సంతతంబు గురు। మంత్రి జపంబును పూజ సాధుస
త్పంతుల సేవయున్నివి। గృహస్థునకుండిన ధన్యుడౌ ధరన్ ॥

శ్రీధరాయనమః

## ౧౦౮ గీతపద్యములు

పుణ్యజనులార జెప్పెద పుడమిలోన । చావుపుట్టుకలనెడి యీాఝుడువునెట్లు
ఘట్టిగావీడుపద్ధతి గనుటయెట్లు । అఖిలగుణధుర్యగురువర్య ఆగయార్య ॥

అనుచుమదినెటుతోచక నండవాదిలి దేశద్రిమ్మరియై నెంతా తిరిగితిరిగి
యవనిమీకీర్తి వింటినిఅమలచరిత । అఖిలగుణధుర్య ॥ 2

పూర్వజన్మార్జితంబైనపుణ్యబలము । నుండుటమువల్ల వింటివేరొండుగాదు
దేవనిదిగూఢతమదగు దివ్యకృపయె । అఖిలగుణధుర్య ॥ 3

సాధుజనులారనేవిన్నసద్గురుండు । నెచటనుండెనొనేబోయి నచటగాంచి
వినయభయములునాయెదవేగిరింప । అఖిలగుణధుర్య ॥ 4

సాగిలగమ్రొక్కిలేచితిసమయమరసి । భజనలెన్నొన్నొజేసితి భక్తిగలుగు
మనసుతోడనెనాదు మైమరచినాను । అఖిలగుణధుర్య ॥ 5

కంపమొందెడికరములుకనులనీరు । గలుగుననుజూచిగురుడుసద్గారవమున
జేరబిలిచియుభయమింక చెందకనియె । అఖిలగుణధుర్య ॥ 6

భీతివిడిపించి సద్గురు ప్రేమతోడ । నచలబోధనుపూర్తిగా నచ్చెటట్లు
బోధజేసియుదిద్దిరి పుడమినన్ను । అఖిగుణధుర్య ॥ 7

కదలికనుజెందదొక్కటికదిలెదొకటి । ఇట్టిరెంటిలొచివరిదాన్నెగురవేయు
పద్ధతినిజెప్పితీర్చిరి పరమగురుడు । అఖిలగుణధుర్య ॥ 8

చెప్పువిషయంబునంతయుచెవులతోడ వినియునంగీకరించితివినయముగను
శిష్యపద్ధతినాలోన జేరెనంత । అఖిలగుణధుర్య । 9

భీతిబోవునుపాయంబు వేడ్కతోడ । కఠినమునులేక సుళువుగ కష్టమనక
బోధజేసిరిగురుడుసంపూర్ణముగను । అఖిలగుణధుర్యగురువర్యఆగయార్య॥

అట్లుపేర్మిమగ క్రమముగ నచలబోధ । జెప్పినావెన్కవెనుతట్టి చిఱునగవున
శిష్య! నీభీతిపోయెనా? జెప్పుమనియె । అఖిలగుణధుర్య ॥ 11

ఝుడుపువదలుట నొప్పిన సద్గురుండు । నిట్లుజెప్పెను నీవిధిసెప్పుడైన
ఒప్పగించుమటంచును జెప్పెనాకు । అఖిలగుణధుర్య ॥ 12

అట్టులాజ్ఞను పొందిన ఆర్యశిష్యు । రాల ప్రేమైకపూరితు రాలనేను
చెప్పుచుంటిని ప్రజలతో చెలిమిగోరి । అఖిలగుణధుర్య ॥ 13

శంక జేసినచెప్పను సరిగతాను । పూర్వమున్నట్టిచేష్టలు పూర్తివిడిచి
విన్ననారికి జెప్పెద విశదముగను । అఖిలగుణధుర్య ॥ 14

గణయతిప్రాసశ్లేషార్థ పాణినీయ । మింతయైనను తెలియదు అంతగురుని
కరుణజెప్పితినీబోధ నే గారవమును । అఖిలగుణధుర్య ॥ 15

ప్రభునియాజ్ఞనుగొనియుసత్ప్రదమునందు। జెప్పదొడగితిగీతముల్ ఒప్పజెప్ప
బూనితినివారిమాటలే పూర్తిగాను । అఖిలగుణధుర్య ॥ 16

శ్రీధరులవారికినిప్రియశిష్యుడైన । దివ్యమూర్తియు శివరావ దీక్షితులకు
శిష్యుడప్పయబ్రహ్మను జేరమ్రొక్కి । అఖిలగుణధుర్య ॥ 17

పరశురామసీతారామ బంటుడైన । బాగవతకృష్ణగురువుల పరమశిష్యు
డైనపీల్ఖాన శ్రీలక్ష్మణార్యవరుడు । అఖిలగుణధుర్య ॥ 18

విమలభక్తుడుపగడాలవేంకటేశు । అమలమతితోడసేవించినట్టినేతివేంక
టేశ్వర ప్రియశిష్యు డాగయార్యు । అఖిలగుణధుర్య ॥ 19

వసుధపరిపూర్ణుడునువాడవల్లివంశ । సాగరాంబుధిచంద్రుండు ఆగయార్యు
సేవజేసియుబోధను సేకరించి । అఖిలగుణధుర్య ॥ 20

ధర్మమును తెల్పుకొంటినిధాత్రిలోన । దేవమాంబనిపేరుతో ప్రేమమీర
పిజలుపిల్తురునన్ను నువసుధయందు।అఖిలగుణధుర్యగురువర్యఆగయార్య॥

తిరిగిచెప్పమటంచు మద్గురుడుబల్క । చెప్పచుంటిని నేగొప్పదానగాను
తప్పలున్న నుదిద్దుడీ ఘనులుమీరు । అఖిలగుణధుర్య ॥ 22

తెలియకనుతప్పలందురువలువజనులుగాని విషయంబు తెలిసియుగల్గుతప్ప
తెలియజేయగప్రార్థింతు దివ్యమతుల । అఖిలగుణధుర్య ॥ 23

విన్న సద్బోధయంకాయు వేగముగను । జెప్పచుంటినిమీముందు చేరివేగ
నొప్పజెప్పంగబూనితి నార్యులారా । అఖిలగుణధుర్య ॥ 24

ఉన్న పరిపూర్ణబ్రహ్మముసుండజూచి । లేనిమాయను వివరించి లెస్సతెలిసి
నట్టిమాయను విడచుజే యచలధర్మ । అఖిలగుణధుర్య ॥ 25

చావుపుట్టుకలేనిది కేవలాత్మ । భావమందునగన్నను బ్రహ్మమదిగా
సేవజేయుము నేలేని మంత్రమునను । అఖిలగుణధుర్య ॥ 26

నాల్గుదిక్కులయందున నడుమలోన । కలగు పైక్రిందులందున కల్గునట్టి
అచలపరిపూర్ణమందున నేనులేను । అఖిలగుణధుర్య ॥ 27

చెదరబోకనుచలనంబు జెందకుండ । ఎదురప్రతులను చూడక చూచుచుండి
మదిలొమంత్రము జపియించమాయలేదు । అఖిలగుణధుర్య ॥ 28

అచ్చటిచ్చటయనకను ఎచ్చటైన । సందులేకనుయున్నది చక్కగాను
యున్నచలము సేవింప సున్నయైతి । అఖిలగుణధుర్య ॥ 29

సగుణనిర్గుణములుగాక సత్తలేని । నిత్యకర్మలులేనట్టి సత్యమైన
బట్టబయలును గననలె నేనులేక । అఖిలగుణధుర్య ॥ 30

చిన్న పెద్దదిగాకను శిలయుగాక । పుట్టుగిట్టుటలేకను పుడమిగాక
నున్నబయలును గురునిచె నెరుగవలయు । అఖిలగుణధుర్య ॥ 31

ఎండవానలుచలిగాక నెల్లవేళ । బిందుకళలునుగాకను సందులేక
వున్నయచలముగననలె నేనులేక । అఖిలగుణధుర్యగురువర్యఆగయార్య॥

యున్నబయలులోలేకనేయుండితోచి । మాటవట్టిది మాట్లాడి మాటమాని
బోతెనేదుంటెనాకేమి బోదునేను । అఖిలగుణధుర్య ॥ 33

చచ్చిపుట్టుచుహెచ్చుచువచ్చుచుంటి । మూలమును లేకవచ్చెదకలనుబోలి
మేల్కబయలును గనుగొన్న నేనులేను । అఖిలగుణధుర్య ॥ 34

మాయయనునేనుయెరుకయేమరుపులయ్యె జ్ఞేయజ్ఞానములన్నియు జీవశివుల
బిందునాదము కళలు పెంపెసగనైతి । అఖిగుణధుర్య ॥ 35

సమితితన్మాత్రలైదునుసకలమయ్యె। ఇరువదైదింద్రియము లహంకరమువలన
వుట్టితోచెను యీమాయ వట్టిదెసుమి । అఖిలగుణధుర్య ॥ 26

తోచబడినట్టినేనుసంతోషముగను । మహిమలన్నిటితోముకత మాయవ
గుచు । మాయకళలన్ని మేల్కొన మాయయగును । అఖిలగుణధుర్య ॥

దేహిదేహమువేరయ్యెదేహియుండి । నేనుబ్రహ్మముతోకల్సినిలుచునట్లు
నన్నవారలునెరుగరు యచలమేదొ । అఖిలగుణధుర్య ॥ 38

సగుణనిర్గుణమన్ననుసత్తుయన్న। యాత్మయనినను యానందహంసయనిన
అన్నియునునేనెకలవలె తోచబడుదు । అఖిలగుణధుర్య ॥ 39

శాస్త్రభాష్య పురాణముల్ సాక్షినేనె । పంచభూతంబులును నేనుభ్రమయు
నేనె । విన్నకనినట్టివినిపించె వన్ని నేనె । అఖిలగుణధుర్య ॥ 40

వేదములునాల్గువేదాంతవిద్యలన్ని । తిరిగిచూచిసర్వంబు తేటగాను
తెలిసియుండినదంతయు తెలియమెరుకె । అఖిలగుణధుర్య ॥ 41

ఇట్టిజాడను తెలియక నితరమతము । లందుముద్రలు సాధనలన్ని జేయ
భ్రాంతిదొలగదు చూడుమా ! వారికెపుడు । అఖిలగుణధుర్య ॥ 42

హరిహరులకునుచిక్కదునలవిగాక । తరుగువిరుగునుగాక నిలిచెమరుగులేక
వరికటమైయుండెపూర్ణముపరమపదము । అఖిలగుణదుర్యగురువర్య॥ 54

మరణమూర్ఛసుషుప్తియన్నహములేక । ఆత్మబ్రహ్మనిగుర్తించెగుర్తులేక
బంధమోక్షము లేకనే బయలుయుండె । అఖిలగుణదుర్య ॥ 55

మొదలుకొనలేకయుండెను కదలలేక । పదములంటైన పరశివతత్త్వమేదో
దాన్నెపూర్ణము మనుచును అచలమనిరి । అఖిలగుణదుర్య ॥ 56

జననియుజనయితజతయైజగముసైతి । నెరుకమరువులుగూడిన తెరగదెల్ల
నేనుమేనులునేనెర్గి నరుగుచుండు । అఖిలగుణదుర్య ॥ 57

ఏనువరిపూర్ణమునుగానుఎండజూడ । బట్టబయలునుగానునే తలుకునేను
నన్ను నేనెర్గి చూడంగ నేమాయయగుదు । అఖిలగుణదుర్య ॥ 58

ఎక్కడకనిన నక్కడ పిక్కటిల్లి । దట్టముగనుయుండె బయలు వట్టలాక
నున్నదానిలోపోయెడి వాణ్ణినేను । అఖిలగుణదుర్య ॥ 59

సర్వలోకములందును సకలవేళ । మరణజననములేనట్టి వరముగనిన
నేనునిల్చాను కలమేలుకొన్నరీతి । అఖిలగుణదుర్య ॥ 60

నేనెతల్లియుదండ్రియునేనెమాయ । నేనెయెరుకన్నయాత్మన్న నేనెసుమ్మి
నేనునిల్చాను గురునిచే మేలుకొన్న । అఖిలగుణదుర్య ॥ 61

సకలలోకంబులునునేను సర్వమంత । నాతోవచ్చి నసర్వము నాతోబోన
తివ్వలన్నియుబోవును నన్తప్పదియ । అఖిలగుణదుర్య ॥ 62

జలచరంబులుబుట్టె బీజంబులేక । నీటిలోపుటిబోషను నిలువలేక
అట్లునేవచ్చిపోయితి నచలమందు । అఖిలగుణదుర్య ॥ 63

ఏకమైతనువునేములులేని కలగ । తోచిగురుకీలుమాత్రచే లేచెచూడ
మాయరూపంబునే కలమాయమాయె । అఖిలగుణదుర్య ॥ 64

జడమనిన మేనుకదలదు సంచలనలేక । అజడమనిన నేనేనుమి అవతరిస్తి
కనుము రెంటినితెలుసుకో కలవిధంబు । అఖిలగుణధుర్యగురువర్య 65

ఎక్కువమక్కువచేతనుట్టినన్ను । యుక్తులెన్నెన్నొ వన్నిరియుండుననియు
చూడమేల్కనునేలేక శూన్యమైతి । అఖిలగుణదుర్య ॥ 66

అష్టతనువులచేనైనయట్టినేను । బట్టబయలును చూడగా భ్రాంతిపోయె
పోయినట్టుపైని నాకిక భీతియేది । అఖిలగుణధుర్య ॥ 67

అదియిదియనకనంతటనన్ని చోట్ల । సత్యమునుచూడు మొదటసద్గురునిచేత
నిండియుండును యితరంబు యేమిలేక । అ లగుణధుర్య ॥ 68

లేనియీ యెరుకమరుపు లేక నేను । తాడుపాముగదోచెద తొలుగుతాడు
యిట్టిమాయనునేసుమ్మి అట్టివిడువు । అఖిలగుణధుర్య ॥ 69

కీలుతెలియకమాయతాకీర్తినొంది । పిండబ్రహ్మాండములకునేమూలమైతి
నేనుపరమును గనగనే నేనులేను । అఖిలగుణదుర్య ॥ 70

గ్రంధరాజంబులన్నియు గణనజేసి । చదివితిని యేమియున్నదో? సరుకు
తెలియ । నన్ను నేతెల్య నాగతి సున్నయయ్యె । అఖిలగుణధుర్య ॥ 71

కోరికతొ జేరవచ్చితికువలయమున । కోర్కెనెరిగింపనా కోర్కె కూలిపోయి
లేకపోయెనుకరుణతో లేనికోర్కె । అఖిలగుణధుర్య ॥ 72

భాషసంపులన్నియుభాగ్యమనుచు । భారతీయులతత్వముల్ తరచిచూచి
నిజగురునిబోధవినికన లేనివయ్యె । అఖిలగుణదుర్య ॥ 73

నాకుదిక్కులేకగలిగి నాకునేను । యుండితోచితికలవతు నుండలేక
వచ్చిపోయెటి నాబాట వరుసగనక । అఖిలగుణధుర్య ॥ 74

తనువుతల్లియుతెల్వియు తండ్రినేను । తనువునేనును జంటనై నేనుగాని
బయలుకనుగొన నేనుండ నిజముగాను । అఖిలగుణమర్య ॥ 75

సాధనలగూర్చిజెప్పెడి బోధవినను ۱ ఎన్ని జేసిన నేబోదు నన్నువదిలి
బాధదెలియని బయలును బాగచూడ ۱ అఖిలగుణధుర్య గురువర్య॥ 87

గురునిదయతోనివింటినిగుర్తువిడచి ۱ ధర్మమార్గంబు బడసితితనువుమనసు
ధనముదారబోసితినయ్య ధర్మదేవ ۱ అఖిలగుణధుర్య ॥ 88

నీరునెడబాయనొల్లని నీటిపురుగు ۱ నిలువనొవ్వనియట్లుగ నేనుగురుని
యాజ్ఞపూనియు నుందును నవనియందు ۱ అఖిలగుణధుర్య ॥ 89

శంకలెన్నెన్నొ బాపిన సద్గురుండు ۱ ప్రభువుదొరకడు బోధచే బాగుజేసి
లేనిబాటను యెరిగించ లేనుయవల ۱ అఖిలగుణధుర్య ॥ 90

గురుడుజెప్పినబోధలుగనిన వెనుక ۱ అజ్ఞమీరక నాయహంబణుచుమనియు
సంచరించుమనెగురుడు సంతసముగ ۱ అఖిలగుణధుర్య ॥ 91

పూర్వపుణ్యకర్మల పరిపూర్ణబోధ ۱ మరుగునెల్లను నాకునేన్పారిజూడ
లేకపోయితినెందైన లేనువెతక ۱ అఖిలగుణధుర్య ॥ 92

ఏమియిచ్చినసరిపోదు స్వామినీకు ۱ నన్నుగైకొను గురుదక్షిణంబుగాను
మాటమానియు నిల్చితి మౌనినయ్య ۱ అఖిలగుణధుర్య ॥ 93

నన్నుజూచెను సద్గురు కన్నుసన్న ۱ జేరబిల్చియుసంజ్ఞచే చెప్పెనిట్లు
నీనిమాటలుజెప్పగ నేనువింటి ۱ అఖిలగుణధుర్య ॥ 94

బాబు! నేజెప్పినపలుకు పాపులకును ۱ బోధజేయకుచెబుపునీబుద్ధికెపుడు
సజ్జనులకును జెప్పు యీ సారమంత ۱ అఖిలగుణధుర్య ॥ 95

మోసపుచ్చెడివారును మొండివారు ۱ జేరిమ్రొక్కియుజెప్పిన చెప్పవద్దు
మానసంబును కనిపెట్టి మాటమాపు ۱ అఖిలగుణధుర్య ॥ 96

చెప్పకూడనివన్నియు జెప్పినాకు ۱ చాటుపలుబోధజేసెను చక్కగాను
ఋణముదీర్చగలేనంటి రూఢిగాను ۱ అఖిలగుణధుర్య ॥ 97

ఓం

# భక్తానంద కీర్తనలు

రేగుప్తి—మిశ్ర చాపుతాళం.

యేమనందును యేమిజెప్పుదురా - సద్గురుని మహిమ ॥ యే

1. భామినీమణి రత్నమాంబకు - భర్తయగు అగయ్యదేశిక
స్వామినన్ను వేగరమ్మని - ద్వాదశాక్షరి బోధదెల్పెను ॥ యే
2. ఘోరమగుసంసారమున నిజ - దారిదెలియ జెడియదావని
కారణా అవతారుడాగయ - షోడశాక్షరి యెరుకదీసెను ॥ యే
3. యేటికీ యీ మమత వలదనె - బూటకపు మతకాంక్ష వలదనె
సూటిగా నామాట వినుమని - నాటకాకల జగమిదంచనె ॥ యే
4. తూడిదేవమాంబ యిల నిజ - షోడశాక్షరి భావమెరిగి
యేడలేక మూడైదులై - పరిపూర్ణబోదను భోదజేసెను ॥ యే

రేగుప్తి — ఆదితాళం

1. శ్రీఆగయదేశిక స్వామిశేవలు - మరువక జేయుడి జనులారా
బాగుగనాదు భవబంధములను - ద్రుంచివేసెను జనులారా ॥ శ్రీ
2. పంచభూతముల ప్రపంచ భ్రాంతిని - ద్రుంచివేసెను జనులారా
సంచితాధర్మను ముంచివేసెటి - మార్గము జూపెను జనులారా ॥ శ్రీ
3. కామక్రోధలోభాది మోహముల - గాల్చివేసెను జనులారా
తామసాది దుర్గుణములన్నిటిని - ధ్వంసముజేసెను జనులారా ॥ శ్రీ
4. కష్టమునక యీ పూర్ణబోధ - దృష్టాంతము దెలిసెను జనులారా
నిష్ఠతోడనే నిర్మలవతియై - నిలచియుంటినీ జనులారా ॥ శ్రీ
5. పట్టువిడువక పూర్ణనందుని - పూజలుజేసియు జనులారా
గుట్టుదెలిసి యీ దేవమాంబ తన - పట్టుపీడెను జనులారా ॥ శ్రీ

కాఫీ–మిశ్ర చాపుతాళం

వాడవల్లి అగయార్యుల–సేవ నీవు మరువకూ ॥ వా

1 పంచభూతములా ప్రపంచ – మంత పెరిగె చూడుమా
కొంచమైనా చంచలత్వ – మో – చించినీవు విడువుమా ॥ వా

2 స్థిరముగ పరిపూర్ణబోధ – స్థితిని నీవు పొందుమా
రేపుమాపుయనగబోకు – మేను స్థిరము కాదుమా ॥ వా

3 యెందుకు యీ మాయభ్రమల – ఈషణత్రయ మొదలుమా
నీవిల్లు యెల్లిపోయేనాడు – వెంటనెవరు రారుమా ॥ వా

4 పదిరెండు తెలిసినీవు – పదియునాలు విడువుమా
చూచెచూపుల కందదూ – అది – లోనబయుట వెల్గుమా ॥ వా

5 నేనుమేనుల కవలిదాన్ని – నే జూడబోతె లేనుమా
గురుమూర్తి సేవజేసియు – నిర్గుణుడవైతె చాలుమా ॥ వా

6 వాసిగా శివనగరమందున – స్థాపితంబౌ పీఠము
దాసురాలు దేవమాంబ – చెప్పె నాగయ పాఠము ॥ వా

మాల్‌కౌంస్–అదితాళం

ఓ గురుదేవా – కరుణామయా– నీ దీనజనులను – కావగరావా ॥ ఓ

1 నమ్మినవారికి – పొమ్మైనావు – సమ్మతితోవఃది – నమ్మితినిన్నే
కరుణను – నన్నీపేళ – మన్నించర దేవా ॥ ఓ

2 నీపాదసేవయె – నామూలధనము – పాపాత్మరహితా – ప్రభునీవెగావా
కరుణాకర – నన్నినాడు – కరుణించర దేవా ॥ ఓ

3 తొలినేజేసిన సంచితకర్మల – కాల్చివేసెటి – ఘనుడవునీవె
శరణాగత – నన్నిలోన – చేర్చుకోర దేవ ॥ ఓ

4 ననుగన్నతండ్రి – కఠినమదేల – కనికరముంచియు – కాపాడవేల
పూర్ణానంద అగయార్య – నన్నేలుర దేవా ॥ ఓ

## నాదనామక్రియ – ఆదితాళం

1 సద్గురుచరణము మదిలోనెప్పుడు – స్మరణజేయవే ఓ మనసా
నిర్గుణుడైనా పూర్ణానందుని – పూజసేయవే ఓ మనసా ॥ స

2 హరిషడ్వర్గములంటని నిజగురు – నాశ్రయించవే ఓ మనసా
దురితజాలముల నరికివేసునె – మరువక మొక్కవే ఓ మనసా ॥ స

3 పట్టియాశల జిక్కియుండుకా – గురునిజేరవే ఓ మనసా
గట్టిగాను ప్రభు చెంతజేరితే – నెట్టునుమాయను ఓ మనసా ॥ స

4 నిరతముగా వేదాంతసారము – స్థితిని తెలుపునే ఓ మనసా
నరకమోక్షము రెండులేని – నిజమార్గము జూపునె ఓ మనసా ॥ స

5 వాదబేధము మానిపెద్దల – మాటలు వినవే ఓ మనసా
సాధనతీతము బయలే బ్రహ్మము – భ్రాంతియేలనే ఓ మనసా ॥ స

6 బాగుగ ఓరుగల్లుపురంబున – అగయదేశికుడో మనసా
వేగమె దేవమాంబ రమ్మని – త్యాగముజేయునె ఓ మనసా ॥ స

## (బృందావనమది అందరిది – అనుమాదిరి)

1 నిరాకారని ర్గుణ నిరంజన – అగయార్య నిజ గురూవరా
కరుణాకరనను కడతేర్చెదరని – మీదరిజేరితి ప్రభువరా ॥ ని

2 పంచభూతముల ప్రపంచమిధ్యని – మంచితెలియు మిము జేరితి
అంచితముగ రానున్న దానికి – ఋుడువక మీదరి జేరితి ॥ ని

3 అహంకారమనె అహంభావము – త్రికాలముల కడదోలితి
నాహం నాస్తియను నాదురహితము – మీదుబోధచే వింటినీ । ని

4 వున్నవాదు చాదస్త మంతయు – వన్నగ పదముల వీడితీ
వున్నదానిని పుండజూచిమది – లేని యెరుక పోదోలితి । ని

5 సాధసలెన్నొ జేయువారితో – స్నేహము నే విడనాడితీ
బాధలేని మీ బోధామృతముచె – భ్రాంతులన్ని విడినాడితి । ని

6 వాసిగాను శివనగరమందున - దోసిలొగ్గి మిము వేడితీ
దాసురాలు ఈ దేవమాంబ - గురు శేషాచల స్థితి నుంటినీ। ని

మాయామాళవ_గౌళ_మిశ్ర చాపుతాళం

1 స్వచ్ఛమైన_ బోదతెలియండీ _ జనులార మీరు
ఇచ్ఛరహితపు - సుఖము నొందండీ
అచ్ఛమైన దేవుడు - ములుగుచ్ఛ _ పందులేక నంతట
హెచ్చుతగ్గులనకనిండి - యేకమయ్యి వున్నడదిగో। స్వ
2 తను మన ధనములను మీరండీ _గురుమూర్తి కిచ్చి
అనయమును పూజించ _ వలెనండీ
జననమరణము లందజేసెటి - సంచితా ప్రారబ్ద కర్మల
అనలమున బడదోసి - పంసారాబ్ధినుంచి దరికిదీసును। స్వ
3 సాధనా వాదనలు గావండీ _ వరిపూర్ణబోద
సాటికీసరి బోధ లేదండీ
వేదశాస్త్రపురాణ యితిహాసాది గ్రాంధలు యెన్ని జదివిన
లేదు యెరుకని యనక యెరుకను - పాదుజేసి భ్రమలమ ంచును। స్వ
4 ధరను ఓరుగల్లు పురమందు
ఆగయ్యదేశిక వరునిసేవలు జేసి ఇహమందు
పురము పావయవల్లెమదిరి - తరుణిమణి శ్రీ దేవమాంబ
వరమపదవికి దారిదెలిపెను - బాట గనుగొని బాగువడుడీ। స్వ

మాయామాళవ_ఆది తాళం

1 గురుడుజెప్పిన పూర్ణబోధాను - మీరెప్పుడు - కరుపుదీరగవినూడీ
తిరముజెప్పగరాదు _ వివరముగానెపుడు
ఎరుకావీడే వి ము _ నెరుగాని వారికి। గురు
2 చూచెచూపులకందదూ - చూచినచూపు - చూపులేకనేయుండునూ

చూడచోద్యమైన - చూపుమలపుర నెపుడు
చూచుచూస్తునెయుంటె - చూపులేక నెపోవు ।          గురు

3 పుట్టుగిట్టుటలేక - పుట్టిగిట్టటినేను - పూర్ణములో లేనెప్పుడూ
పుట్టుగిట్టుచునుండి - కలవాలె నేనెపుడు
గట్టిగురుని జేర - పుట్టిమునిగిపోవు ।          గురు

4 కదలామెదలా బోకను - కదిలెమెదిలె - కలనేను లేదెన్నడూ
కదిలిమెదిలె నేను - కదలాదాన్ని చూస్తె
కదలమెదలలేక - కలకాలమును లేను ।          గురు

5 అవతారపుషుడు - అగయార్యస్వామి - అనహతీతగురుడు
అరయవారి కృపచె అంతూదెలిసి చెంత
అర్పిస్తి దేవమునై - అర్ఘ్యపాధ్యా లెరుకా ।          గురు

(సందమయా - అనుమాదిరి)

1 వినరండయా మాట వినరండయా
మేను నెంతొపోషించినా నిలువాదయా
చెందండయా బోధ చెందండయా
సద్గురుని సన్నిధి జేరండయా ।          విన

2 కర్మబంధములన్ని త్రెంపుకోవాలంటె
కరువుదీరగ బోధ జెందండయా
నేమనిష్ఠలులేని పరమపదవిని గని
నెమ్మదిగ భావములో దెలియండయా ।          విన

3 పుట్టి కర్మలను బొంది లయంబొచు
అట్టె జీవులవలె శ్రమల బొందు
పామునోటను కప్ప బడినవిధంబేను
పామరుల భావంబు విడువండయా ।          విన

4 గురువులేని నరుని యెంచగారాదంత
ముండమోయువనిత ముఖముకాంతి
తల్లిలేనిపిల్ల తనువావిధంబయ్యా
గురువులేని విద్య యింతేనయా । విన

5 సకలజీవులొక్క సమమని మదినెంచె
చక్కనగు మార్గంబు దెలియలేక
గురిజ సలువుగనక మరిచినా విధముగా
పురికిపురికి బోర్ల పడతారయా । విన

6 నేను నేనెవడనె నిజము తా నెరుగక
మేనుస్థిరమని పెక్కు భ్రమలజెందు
ననుపు వాడపల్లి ఆగయార్యులు దెలుపు
దేవమాంబ విని జెప్పేనయా । విన

మాండ్—ఆదితాళం

యెందుకు డంభాచారం – ఓ మాయ నరుడా । యెం
1 నేనునేనను అహంవుడుగక – అష్టమదంబుల అణచివేయక
అరిషడ్వర్గము ద్రుంచివేయక – త్రిగుణంబులను దీసివేయక । యెం
2 గురువనెటి గూఢార్థము తెలియక – దుష్టబుద్ధిని దూరముచేయక
మాయనువిడిచెమార్గముదెలియక – కాయము స్థిరముకాదనిదెలియక।
3 మేనుజూచుకొని నేననిమురచి – నే - నెవడనె విధము దెలియక
పామరత్వము పాడుజేయక – పరమపదవికి దారిదెలియక । యెం
4 ఈషణత్రియ భ్రమలముంచక – యింద్రియనిగ్రహ మరుగుదెలియక
నాల్గుమేనులనటనదెలియక – నాదబిందుకళాతీతముదెలియక । యెం
5 ఆగయార్యగురు పదమునెరుగక – త్యాగము నీమది చేయనెరుగక
దేవమాంబ వినజెప్పిన వినక – సోమరిపై యిల వలలోచిక్కేవు। యెం

3 ఎందుకుతొంధర సందేహమువిడి _ ముందుగ సద్గురువమూర్తి సేవలు
మదిలొజేసి పెనుమాయనువీడి - పరమునెరిగెడి మార్గముతెలిసియు ।

4 మేనుజూచుకొని మురయుచుంటివా _ నేనుమేనులకు వేరై యున్నది
అదియెవరమని పదిరెండునుగని-పదియారునువిడివలుకునువిడిచియు ।

5 ఈసర్వముతన దెపుడుగాదని - పూర్వమేమియు లేదులేదని
నిర్వికారుని నిత్యము దలచియు _ నుర్విజనులకున్నట్లు మెదలుచు ।

5 ఓరుగల్లు పురమందు వాడపలి _ ఆగయ దేశికు సేవలుజేసి
దేవమాంబశివనగరమందున - తరచితరచి యీ తత్వముదెలిపెను ।

(కల నిజమాయెగా—అనుమాదిరి)

1 వాడపల్లి ఆగయా _ ముందు మిమ్ము గానకా - యెన్నో జన్మాలెత్తితి
నన్ను గావ రావయా । వాడపల్లి ఆగయా

2 ఓ.... నేనీజన్మ మందునా - యెన్నో పూజలు జేయగా
నే _ నెన్నో పూజలు చేయగా
మీదుదశిశనమాయగా - పూర్వపుణ్య ఫలమేగా
నా _ పూర్వపుణ్య ఫలమేగా । వాడ

3 నా.... మాయనువిడదీసినా - మద్గురాగయ దేశికా
శ్రీ _ మద్గురాగయ దేశికా
మమతలన్ని నీసియూ _ మంచిమార్గము చూపినా
ఈ _ మంచిమార్గము చూపినా । వాడ

4 ఆ.... పదిరెండెరుగుమంటిరీ _ పదహార్ విడువుమంటిరీ
ఈ _ పదహార్ విడుమంటిరీ
కలనెడబాయుమంటిరీ - కన్నతండ్రి నీవయా
నా - కన్నతండ్రి నీవయా । వాడ

5 ఉ.... గుళ్లుగోపురము లేనిదీ _ అవుతుదేవుడు కానిదీ
ఈ _ అవుతుదేవుడు కానిదీ
విస్సు దేవాంబ నీవది _ ఇదిగోచూడని యంటిరీ
అ _ ల్లదిగో చూడని యంటిరీ । వాడ

మాయామాళవ—గౌళ—అటతాళం

1 అన్నలారమీరు విన్నారర - సద్గురుడు - నన్నుదెలియుమన్నడు -
మనసిచ్చియు మళ్లిమళ్లినుమన్నడు - చెడుగుణములు అన్ని విడువు
మన్నడు - చంచలము విడి - నిశ్చలులు గమ్మన్నడు -
వున్నబయలు జూపి - కన్నయెరుకను బాపి -
మున్ను జేసిన కర్మ - సున్నా జేతన్నాడు । అన్న

2 సాధనలాతోటి - సాధించరానిది - యోగాము వలదన్నడు -
సద్గురుస్మరణ సలుపనీకుదినన్నడు - అంతటనున్న అచలాము గను
మన్నడు - మదిని తరచి - చెంచాలమిడు పున్నడు -
వాడభేదము లేని - పూర్ణబోధను జెప్పి -
నాదంతర్గత యెరుక యేడలేదన్నాదు । అన్న

3 ముద్రిలై దింటీని ముదమూతా జూచిన ముక్తి లేదనియన్నడు -
జ్యోతివెలుగు నీలోచూడుమన్నడు - చూచినగాని ఫల మే మి లే
దన్నడు - కన్నులకది - ఆనందకరమన్నడు -
దీన్ని మించిన బయలు - గాంచి మేనెరుకాల -
వన్నెలన్ని యుతీయు - మూడుకాలములందు । అన్న

4 చపలత్వముడుగాదు - జపతపములజేయ - సంశయమిడుమన్నడు -
చావుపుట్టుకలేనిది గనుమన్నడు - పెద్దలమాట ప్రేమాతో విను
మన్నడు - మాయమాటలసలె నమ్మకన్నడు -
వుపదేశమొందీయు - ఇహపర సౌఖ్యాల -
నెపమెన్నకను వీడి - వుపచారములుజేయు । అన్న

5 అరమరలేనట్టి - పరిపూర్ణబోధాను - స్థిరముగ వినుమన్నడు
కదలికలేక - నిలిచియుండుమన్నడు - నేననెనిన్ను - తెరదీసి చూ
డన్నడు - తిరిగిచూస్తె - గురునితోడని యన్నడు -
భావతీత - ఆగయార్యులవాక్యము -
దేవమాంబ విని విధిగా తేటగదెల్పె । అన్న

తత్వము

1 వినరయ్యా యీ పూర్ణబోధను - సొంపుగవినికన్న - సద్గురునాజ్ఞ మీరకున్న - తననుతానెరుగజేయునన్న । వినరయ్యా....

2 అంతయింతదని అంతుదెలియ - యాద్యంతములేదన్న - సర్వము నిండియున్నదన్న - చింతలెరుగనిది - శ్రీగురుగోప్యము - అంతు దెలియుమన్న । వినరయ్యా....

3 యజ్ఞము యాగము మంత్రజాలము - పంచముద్రలెల్ల - జేసిన కడ తేరుట కల్ల - యోగము తంత్రమహిమజాలము - మాయలు జగమెల్ల । వినరయ్యా....

4 సాధనలెన్నో జేసినగాని - జాడతెలియరాదు - పరము తా ప్రత్యక్ష ముగాదు - ద్వాదశిషోడశి మంత్రమెరుగక - చపలత్వము బోదు । వి

5 కాషాయవస్త్రములు కట్టినగాని - ఖర్మతొలుగబోదు - తాననే దెవరొ తెలియరాదు - వేశములేసి - జడలుపెంచితె - జన్మసున్న కాదు । వినరయ్యా....

6 తన్నుగనకతా నెన్నిజేసిన - దృష్టిలయంబగునా - బ్రం....మైక్యము తనగునా - జననమరణముల జాడనెరుగక - వాదునాడతగునా । వి

7 స్థిరముగాను శివరామదీక్షితుల - అచలబోధనండీ - యెరిగిన - ఆగ యార్యులండీ - అరమరలేక దేవమాంబకు - స్థితిని దెలిపెనండి । వి

శ్రీరాగం-ఆదితాళం

1 గురుడేబ్రహ్మము - గురుడేవిష్ణు - గురుడేశంకరుడండీ
గురువరుడేపరబ్రహ్మంబనుచు - గురిచుదిలోనిలుపండి । గు

2 ఆశలేనిగురు - నాశ్రయించియు - అరమరలేకమీరండి
దేశికుసేవలుజేయువారికుప - దేశమిచ్చు వినరండీ । గు

3 రాదుజన్మమిల - లేదులేదుయని - మోదముతోడుతనండి
ద్వాదశిషోడశిద్వయమంత్రంబుల - బోధజేయువినరండీ । గు

4 కనుమూసినను _ కనుదెరచినను _ కనుపడుదేవున్నండి
కనుగొనుమదెయని - జూపించునుయిది - కల్లగాదువినరండీ | గు

5 మూలములేని _ తోలుబొమ్మలని - కలదృష్టాంతమునండి
మేలుగానుజూపించిలేనెరుక _ కీలుదెలుపువినిరండీ | గు

6 పూనియున్నపరి - పూర్ణమందున - లేనిదిలేదనునండీ
లేనియెరుకలేకున్న పిదపను - అనరానిదెవినరండీ | గు

7 వెంకటేశ్వరుని _ కింకరుండసై - పొంకముతొ డుతనండీ
శంకలుబాసినఅగదాసని - అంకితమునువినరండీ | గు

మాండ్‌రాగం—ఆదితాళం

శివరామదీక్షితులబోధ-ఓరి-చెవినిండ వినికంటె-భువిలో బుట్టవుగాద | శివ

1 అవనిలోపరిపూర్ణ-మచల సద్గురుమూర్తినాశ్రయించియుమ్రొక్కరాద
స్తవము జేసిసేవలుసల్పిబోధ _ పవలురాత్రియునకుండవినరాద
భవబాధలన్నియు - బాసిపోవునుగాద | శివ

2 లింగాడు శ్రీపాండు _ రంగడనిరాయిాకి - వంగిదండంబెట్టుటేల
పొంగిదొందబోధలువింటెమేల _ అంగలింగాముధనమయాగోళ
సంగాములేనట్టి - సద్గురునికిచ్చియిల | శివ

3 యెన్నరానిజన్మ - యెత్తియెత్తిసర్వం _ బున్నదేవునిగనలేకోరి
అన్నియిన్నిబాధలగలిగెమీరి - విన్నయెన్నిజదివితెనేమివారి
పున్న పరిపూర్ణాము - గన్నసద్గురుజేరి | శివ

4 మూలములేనట్టి - తోలుబొమ్మలటంచు _ కీలుదెలిసియుమాయశోద
యేలజేయకున్నవుయింతచేద - మాలకాకిపై చెడిపోకబోధ
మేలుకొనయాస్వప్న - ముళ్ళక్కిగాద | శివ

5 వెంకటేశ్వరస్వామి - కింకారుడైనట్టి - శంకరహితుడుఅగదాసు
పొంకముతొజెప్పినదివింటెపొాసు - వంకలేదెన్నటికీరశబాసు
మంకుమతములజోలి _ మానుకుంటెనెదెలుసు | శివ

## తత్వము

ఏదిరాయీ జననమరణాము - నిజ బోధగనిన - లేదురా యీమోక్ష నరకాము - యేదిరా యీ జననమరణము – లేదురా పరిపూర్ణమందున వేదశాస్త్రాభ్యాసులనుమత - వాదులనువిడనాడువారికి । యేది

1 తాను వచ్చిన చోటుదెలియాదు – తనతోటి సర్వము - తర్లి పొయ్యే బాటనెరుగాదు - లేని పోని స్వప్నమందున - యేనుగులు గుఱ్ఱాలు రథములు - సేనలూ సేనాధిపతుల - యోనిసంభవమైనతనువుల । యేది

2 రాజులేడు మంత్రిలేడురా - రాజొక్కడుంటె - గాజు కడియమదెందు కౌనురా - రాజులేని కయ్యు మాయను - రాజ్య కాంక్షలు దబ్బదాయను వాజిపేయులసోమయాజుల - వాంఛకలలోవార్తలాయను । యేది

3 దిక్కులేని దొరతనాముర - దిక్కనేదుంటె - నిక్కముగ యీ జగము లౌనురా - దిక్కులేని తనువు యిలపై - పెక్కు శాస్త్రామూల గాధా - ఒక్క ఔప్పపాటులోపల - బుక్క బెట్టును పెక్కుజీవుల । యేది

4 తల్లినీ స్థూలాంగ మందూరా - తరువాత దాని - పిల్లనూ సూక్ష్మాంగ మందూరా - తల్లి జాగ్రత పిల్లస్వప్నము - పిల్లజాడె తల్లికాయను - యెల్లలోకము బ్రతుకుభాగ్యము - చెల్లుబోయినపత్రమాయను । యేది

5 వింత వింతలు తోలుబొమ్మాలూ - పరిపూర్ణ జలధిలో - మంతలూ యీ కీలు బొమ్మాలూ - భ్రాంతి రహితామైన గురునీ - చెంతజేరిషోడశాక్షరి - సంతతము యీద్వాదశాక్షరి - చింతనాజేసేటివారికి । యేది

6 నీవుబయలులోనయుంటివీ - నీయందుబయలు - నిండియున్నాదెరుగ కుంటివీ - నీకు బయలూ సూచనైతె - నిలువ లేవూ నిమిషమైనను - కేవలము నీకావలీపల - స్థావరము పరిపూర్ణ మాయను । యేది

7 సందియంబులదిరెనేటికీ - మాదెందుకూరి - యింద ధరుని శిష్యకోటికీ యెందరూ లేదన్న బయలూ - యెందుకూ లేకుండబోవును - అందరిలో సుబ్బరావియీయాయనుభవార్థంబిచటదెలిపెను । యేదిరా

శ్రీకృష్ణపరబ్రహ్మణేనమః

## ...* మేలుకొలుపు *...

మేలుకో శ్రీదేశికేంద్రా। మేలుకోవో పూర్ణసాంద్ర। మేలుకో
శివరామదీక్షిత। మేలుకోవయ్యా। మేలుకో

శ్లో॥ భ్రమేణాహం భ్రమేణత్వం। భ్రమేణోపాసకాజనాః
భ్రమేణేశ్వర భావత్వం। భ్రమమూల మిదం జగత్। 1

భ్రాంతిచేతను నేనునీవును। భ్రాంతియే ఈశ్వరజగత్తని। భ్రాంతియే సర్వంబటంచు। విభ్రాంతులనుజేయా। ఈ జగద్భ్రాంతి విడదీయ దేవా మేలుకోవయ్యా। మేలుకో

శ్లో॥ త్యజధర్మమధర్మంచ। ఉభేసత్యానృతేత్యజ
ఉభేసత్యానృతే త్యక్త్వా। యేన త్యజసితత్త్యజః। 2

ధర్మధర్మములాలో రెంటిలో। మర్మమును బోధించి విడుమని। మర్మమెరిగిన జ్ఞాతయౌ। నన్నసలు విడమనగా। గురుకట్నమను గొనగా। దేవా మేలుకోవయ్యా। మేలుకో

శ్లో॥ గురుణావరణత్యాగః। అనావరణముత్తమమ్
పరిపూర్ణం పూర్ణమేవ। పూర్ణాచల సముద్రవత్। 3

సరగునను సద్గురునిగాలిచెటి। ధీరవరులావరణరహితుల। జేసి పరిపూర్ణచల సాంద్రుల। ఖండులుగా జేయా। శరీరాత్మలను దీయా। దేవా మేలుకోవయ్యా। మేలుకో

శ్లో॥ అబీజం వృక్షసంపన్నం। శాఖాపల్లవ వర్జితం
పుష్పంనాస్తి ఫలంనాస్తి। సంపూర్ణం వృక్షవర్జితం। 4

అష్టవిధ ప్రకృతుల చేతను। సృష్టి కారణమాయెననుచును। స్పష్టముగ శోధించిచూచిన। బీజరహితమనీ। నిర్బీజ బ్రహ్మమనీ। దేవా మేలుకోవయా। మేలుకో

శ్లో॥ సర్వశూన్య మయంరూపం । జన్మ శూన్యం స్వభావతః
టన్మభావేవ మృత్యుశ్చ । పరిపూర్ణ స్వభావతః । 5

జరయుమృతులును । లేనిపూర్ణము । విరివిగను జన్మంబు శూన్యం ।
తరచదానందేమిలేకను । దండిగున్నదనీ । పరిపూర్ణ బ్రహ్మమనీ....
దేవా మేలుకోవయ్యా । మేలుకో

శ్లో॥ జన్మాభావే కర్మంనాస్తి । కర్మాభావే ఫలంనహి
ఫలాభావే భయంకుత్రి । భయాభావే నసంశయః । 6

దేశికామీ కరుణచేతను । ఈ శరీరద్వయము పోయిన । నాశమౌజన్మ
కర్మఫలభీతులు । లేశమైననూ నిశ్సంశయముగాను । దేవామేలుకో
వయ్యా । మేలుకో

శ్లో॥ ఇంద్రజాల మిదంసర్వం ! యథామరు మరీచికా
అఖండిక మనాకారం । వర్తతే కేవలంశివం । 7

వుండిలేనిది ఇంద్రజాలము । యెండమావుల వలెనుదోచును । ఖండిత
ముగానట్టిఅచలా । పూర్ణ బ్రహ్మమునా । పరిపూర్ణ గురుడనినా ।
దేవా మేలుకోవయ్యా । మేలుకో

శ్లో॥ శుద్దే సుషుప్తావివచ । తస్మిన్నాహం కదాచన
తద్వ్యత్పదాపి యస్మాత్ప్తి । ప్రపంచంనాస్తి తన్యపె । 8

షుప్తియందున నేను లేనటు । జ్ఞప్తిలేనా పూర్ణబ్రహ్మని । జ్ఞప్తిలేక
నిర్లిప్తుడావై । షుప్తిజెందకనూ । సంజ్ఞాప్తి విడిచియునూ । దేవా
మేలుకోవయ్యా । మేలుకో

శ్లో॥ యథానాహం తథాశుద్ధం । తస్మాత్ శుద్దేనసిర్ణయః
జగదస్తీతికోవేద । నాస్తికోనచనిర్ణయనః । 9

లేని నేనను నేను యెన్నడు । లేఃపోవును గానిదెన్నడు । నేనుగానా

పూర్ణ బ్రహ్మను । నిర్ణయించదనీ । వర్ణించ లేనిదనీ । దేవా మేలుకో వయ్యా । మేలుకో

శ్లో॥ ఆత్మాతీతం కేవలాత్మా । దేహోనాస్తి కదాచన
అస్తినాస్తీతికోవేద । నిర్ణయోనాస్తి సర్వదా । 10

అద్వితీయము అచలపూర్ణము । ప్రకృతి ద్వయ దోషరహితము । సద్విచారణ కేవలాత్మను । యెవ్వరెరుగుదరూ । నివ్వెరన పొందెదరూ । దేవా మేలుకోవయ్యా । మేలుకో

శ్లో॥ శాస్త్రజ్ఞానం బహుక్లేశం । బుద్ధేశ్చలన కారణం
ఉపదేశాద్ధరేద్బుధ్యా । రమంతే సర్వ కర్మసు । 11

బుద్ధి చాంచల్యమును జేసును । శాస్త్రజ్ఞానము బహుక్లేశము । హద్దుమీరక గురునిముఖమున । పద్ధతినివినసీ । సుద్దెఅయిన మార్గమనీ । దేవా మేలుకోవయ్యా । మేలుకో

శ్లో॥ ఉల్కాహస్తో యథాకశ్చి । ద్ద్రవ్యమాలోక్యతాం త్యజేత్
జ్ఞానేనజ్ఞేయమాలోక్య । పశ్చాత్ జ్ఞానం వినశ్యతి । 12

తిమిరమందున యున్నవస్తువు । అమలజ్యోతిచెవెదకి విడచును । జ్యోతి నటువలెవున్న జ్ఞప్తిచె । జ్ఞేయమెరుగుమనీ । తద్జ్ఞప్తి విడువుమనీ । దేవా మేలుకోవయ్యా । మేలుకో

శ్లో॥ జ్ఞానమజ్ఞానినంద్రష్ట్వా । ద్వయోస్త్యజతి నిశ్చయం
ద్వయోస్త్యజతియత్ జ్ఞానం । తత్ జ్ఞానంచ పరిత్యజేత్ । 13

జ్ఞానజ్ఞానము రెంటినిజమును । యెరుగుసు జ్ఞానంబటంచును । జ్ఞానజ్ఞానము ద్వందమనుచున్ను । విడచుసుజ్ఞానం । తత్ జ్ఞానరహితమె పూర్ణస్థితిన్యాయం । దేవా మేలుకోవయ్యా । మేలుకో

శ్లో॥ విద్యాంతం బ్రహ్మ విద్యాంతం । వార్తికాంతమగోచరం
పూర్ణబోధం ప్రవక్ష్యామి । శృణుశిష్య మహోత్తమం । 14

విద్యకంతము బ్రహ్మ విద్య । దానికంతము వార్తికంబున । వార్తి కాంతమ గోచర । మవ్యక్త మదియనుచూ । తద్ధరినీ పూర్ణ బోధను చూ । దేవా మేలుకోవయ్యా । మేలుకో

వాలిగా తొసూప్పడి పురమున । స్థాపితం బౌపీఠమందున । దోసిలొగ్గి రామ రావిటు । లేక మేల్కొల్పె । గురు బృంధమునమేల్కొ । దేవా మేలుకోవయ్యా । మేలుకో

## మేలుకొలుపు

మేలుకొను గురు పుత్రులారా - మేలుకొనరె పవిత్రులారా - మేలు కొను సుచరిత్రులారా మేలుకొనరయ్యా - మిత్రమా మేలుకొనరే ।

1 గాఢనిద్రలో మునిగియున్న - తోడి మానవుల మేలుకొల్పి - కూడి అజ్ఞానాంధకారము - కూల్చి వేయుటకై - మిత్రమా మేలుకొనలే ।

2 మానవసేవ మన గురునిసేవ - మరువకుడి యీమూల సూత్రము - మానవుండన్ రాళగురు - మమ్ముద్ధరించునటే - మిత్రమా మేలుకొ ।

3 బోధ భాణుండుదయించిన - భ్రమ తిమిరము పొడచూపునా? - గురు సన్నిధి జేరమనకిక - కొరత యుండూనా । మిత్రమా మేలుకొనరే ।

4 గురువాజ్ఞకు బద్ధులయ్యి - గురు శిష్యులేకమయ్యి - జరుప సర్వకార్య ములలో - జయమెవినరోయీ - మిత్రమా మేలుకొనరే ।

5 గట్టిగా గురు గుట్టునెరిగి - పట్టుచే సంగకట్టుకట్టి - లెట్టు దౌర్బల్యముల యిహపర - నీతినిలుపుటకూ - మిత్రమా మేలుకొనరే ।

6 కలయ గురుశిష్యుల శక్తిని - కాలమెదిరించగపోదూ - వలుకరేమన మూల పురుషులు - వలుతె రంగులనూ - మిత్రమా మేలుకొనరే ।

7 గురుబ్రహ్మం గురువిష్ణుం - గురుదేవమహేశ్వరంచూ - గురుసాక్షాత్ పరబ్రహ్మని - గురియుజూపెగదే - మిత్రమా మేలుకొనరే।

8 గురుబ్రహ్మోత్పత్తికర్తని - యెరసి సర్వోన్నతి బీజము - వరగనాఊఫల ప్రదంబౌ - కరువుదీరుగదే - మిత్రమా మేలుకొనరే।

9 సర్వకళలకు మూల సూక్తం - సరస్వతియె గురుని వాక్యం - అంది జ్ఞానం బొందసౌఖ్యం - హైందవులారా - మిత్రమా మేలుకొనరే।

10 పాలకుడు గురువిష్ణుమూర్తి -పాలించును జగఖ్యాతి- నీలిమయమము శాంతిభద్రత - నిలువనీయిలనూ - మిత్రమా మేలుకొనరే।

11 తను మన ధనములానొసగి - అనయము గురు కార్యదీక్షను - పలులు సల్పస్వతంత్ర లక్ష్మి - ఫలములొనగుగదే - మిత్రమా మేలుకొనరే।

12 గురుడుమహేశ్వరుడెకాలుడు - సర్వమునుహరించుబుధుడూ - యెరుగుమిట్టి శక్తి కాలన్ - చిలనుబొగడగనూ - మిత్రమా మేలుకొనరే।

13 అసువులోనే సర్వజగములు - జనించి మించి - జనుచు నుండునూ - కసుమిదెఉత్పత్తి స్థితిలయ - కాలగతియనుచూ - మిత్రమా మేలు

14 గురుసాక్షాత్ పరబ్రహ్మని - గుర్తెరుగుఅనువుకు యూవలిది - యెరిగి అడుగా - ఆరిగెరాము - అంధులే రోయీా - మిత్రమా మేలుకొనరే

15 భూమనీగురువర్యుడాయె - భూమియే నీదేవుడాయె - భూమలోదోచీన పత్వం - బేమిలేదాయే - మిత్రమా మే॰కొనరే।

తత్వము

ఓరివినరా మాయసంసారి। గురుమూర్తి నిజేరి। ఓరి

ఓరివినరా రానివోని। దారితెలియని మతవాదముల

ధీరతానౌననుచు। మొరిగేవూ। దరిగానలేవు। ఓరి

1 ఉన్నదీ లేకున్న సర్వం। ఉన్నదే పరిపూర్ణమనుచు। తిన్న నీయీా

బోధగనరాదా । చిక్కిదేకాద । విన్నకన్న శాస్త్రదుర్బోధా । విధి దార్థముగాద । ఎన్ని జన్మములకు యీబోధా । యెరుగనిదే బాధా । చిన్నినాట నుండి చదివి । యున్నాదాన్ని దెలియలేవు । అన్ని చదువూ లాకుమూలామూ । అహమేదుర్గుణమూ । ఓరి

2 మూలము లేని గుర్తెరిగె । మురికి తోలుతిత్తి ముక్కూ । దూలమూలో శివుని జూపూటా । దొంగ గురు బాటా । నీల మేఘమూలో మెరుపాటా నిగమార్థ మాటా । కూలికీ యీవిషముద్రాగూటా । కూడా దానోటా మూలకాకి వానికి బయులూ । మర్మ దెలియదూ ఛీఛీ । పాలు మాలి కోరివశరీరి । వద్దాతీజేరి । ఓరి

3 వచ్చి పొయ్యే వారాలాతో । యిచ్చకామెందూ కూకలలో । వచ్చినా రాజూలు మంత్రులూ । వన నిధులు బుధులూ । యెచ్చటా జూచీన హయమూలూ । యేనుగలూ నగలూ । ముచ్చటా లాడూచు సుంద రులూ । మోహితులు హితులూ । మచ్చికాలూ జేయాయెంతో । మనసులో మోహామూజెంది । చెచ్చరా పాటూన మేల్కొనగా । చెడెరాయిదికలగా । ఓరి

4 శంకరాచార్యుల వారీ । బొంకులాకు తప్పే లేదా । వంకనూ రామాను జార్యూలూ । వారికిమిగులా । కొంకకా వ్రాసిరి గ్రంధములూ । గొలుసులు వగ్గములూ । లంకెమల్లూ పాశబంధములూ । రాద్ధాంతా మూలూ । రంకులు నీకేల శివారాములూ । శ్రీధరులావారి । శంక రహితామైనగ్రంధములూ । సంగామూగానూ । ఓరి

5 యెంతవారో సాంధీపూలా । పొంతనూ శ్రీధరులావారి । చెంతను శివరామ నిజమౌనీ । జేసినవద్ధతినీ । భ్రాంతి రహితామైన సంగతినీ । పరిపూర్ణ స్థితిని । యింతకూ మిక్కిలి లేదానీ । యింత రేచ్చమానీ । సంతతా మాదెందూకూరి । సాంబయూ నిజగురునీ బోధా । స్వాంతు డూయిాసుబ్బకవినోటా । వచియించినమాటా । ఓరి

## శ్రీ సచ్చిదానంద వేంకటేశ్వరవధూత స్వాములవారిపై

### పాట — రూపకతాళం

1 సచ్చిదానందవధూత దేవా । వెంకటేశ్వరా । పిచ్చివాని యున్కి
మోమున । సచ్చరితుల బోధించినారు । మెచ్చనలవియె ఆజహరులకు ।
యిచ్చ రహితస్వచ్ఛందుడ ॥మి॥ హెచ్చుగ హనుమంతార్యుని ।
మచ్చమాన్పి వరముదెల్పి । సచ్చరితుండనుచు మెచ్చి । భూమా
నందని పిలచిన । సచ్చి

2 తృష్ణచేత కృష్ణసింహులు । విష్ణువనుచు మిము గొల్వగ । శ్రేష్ఠమైన
బోధదెల్పి । సృష్టికీరాకుండజేసి ॥మి॥ నిష్ఠతో యందరికిలాదిపై ।
బృష్ఠ బీజమపై వెలసియు । సృష్ట్యాదిస్థితి బొందిన దిష్టాఽహితా
శ్రేష్ఠా । సచ్చి

3 రామ సింహ ప్రభుడుమిమ్ము । భూమయనుచు దరజేరియు । స్వామి
మీద సేవజేసి । నీమమెరుక దక్షణీయ ॥మి॥ విబ్బరమౌనిజ
శిష్యా । నిశ్చలనందాయనిగిన్ । సద్భక్తాహృదయవాస । నిర్భీజుడ
నిజమౌనీ । సచ్చి

4 మిత్రి రహిత దేవుడవని । తాత్త డి శ్రీనర్సమాంబ । అత్రి తిరుగ
అంత్యమందు । వాత్రిళ్లతో వరమునొందిర ॥మి॥ శంతసమొం
తెటివేళలో । నిర్మలాంబయని పిలనియు । కర్మలబాపిన నిజగురు ।
కరుణామయు । పరమగురూ । నచ్చి

5 మార్గదర్శకుడ వగుచును । సద్గురు శ్రీ దుర్గనందునక । సర్గళాబోధంద
జేసి । స్వర్గ నరకమూల ద్రుంచి ॥మి॥ నిర్గళమగ భారతివౌ దుర్గా
నందాయనుచును । అర్ఘ్య మెరకనందుకొన్న । వర్గరహిత వరగురు
వర । సచ్చి

6 కామకులిల తెలియులేరు । అమ హోమహు డమరసుతుడు । రామ
మూర్తి ప్రభుడు దక్క ॥మి॥ ధీమతివై ఖలజగమున । బోధా
నందై యుండని । యామహిదీక్షను నొసగి । పీఠాధ్యక్షునిజేసిన । స

7 వాసిగా తొసూప్వడిపీఠ । దాసుడౌ యెరామరావు । దేశికా శ్రీ దుర్గనందుని । దోసిలొగ్గి శేవ జేయ ||మి|| దేశిక మీచరితంబిటు దోష రహితమని దెల్పగ । పూత చరిత మిమ్ముదలచి । రోసితి యిహ పర యాశల । సచ్చి

## — తత్వము —

1 సందులేక యున్నదన్న - కన్నవారి జన్మ సున్న
సద్గురుని జేరియున్న - నిన్న జేసె నన్ను సున్న ।
2 గురుశిష్య లేకమున్న - గుర్తు దెలియ కున్నదన్న
మరువకయీ బోధవిన్న - నరకము విడి పోవునన్న । సందు
3 భ్రాంతియే యీ జగములన్న - జననమరణము బాధకన్న
భ్రాంతిరహితము గాకయున్న - జననమరణము దొలుగదన్న। సం
4 బట్టబయలనె దానికన్న - మొట్టమొదట పేరుసున్న
వట్టియెరుక బుట్టెనన్న - యిట్టి పేరు బెట్టెకన్న ।
5 పలుకనిది పరిపూర్ణమన్న - సాటిదీనికి లేదురన్న
ద్వాదశీని తెలుసుకున్న - లేనీ పదియూరు సున్న । సందు
6 పంచదశిని దెలుసుకున్న - స్వప్న బాధ దొలుగునన్న
నేను నేననే అహముయన్న - లేషమైన లేదురన్న । సందు
7 ఘనుడు ఆగయార్యుడన్న - వినయముతో దెలిపెనన్న
విన్న దేవమాంబ యిలనిజ - స్థితిని నిలచి యుండెనన్న। సందు

## పరంపరా మంగళారతి

ఆనంద భైరవి రాగం - ఆగతాళం

1 శ్రీకరంబైనట్టి - ఓంకార పీఠమున - ప్రాకటంబుగ హరికి - భానున కును - ఏకముగ వెలిగేటి - యాజ్ఞవల్కికి మరియు - జోకతో రాజ ఋషి - జనకపతికి - జయమంగళం నిత్య శుభ మంగళం - జయతు జయమంగళం మహోత్సవ మంగళం ।

2 శుద్ధతత్వజ్ఞుడౌ - శుక యోగికిని నిత్య - సద్ధర్మమార్గుడౌ - సాంధీపు
నకు - సిద్ధముగ పూర్ణుడౌ - శ్రీ కృష్ణమూర్తికిని - ఒద్దికతో అర్జున -
యుద్ధవులకూ | జయ

3 శ్రీమించి వెలిగేటి - శ్రీధర స్వామికిని - ధీమించు శివరామ - దీక్షి
తులకు - కామితార్థములిచ్చు - ఘనఅప్పబ్రహ్మముకు - వేమారు శ్రీ
సీత - రాములకునూ | జయ

4 పరిపూర్ణబోధను - ప్రకట పరచినయట్టి - వరభాగవత కృష్ణ - గురున
కిపుడు- నిరతంబు పరతత్వ - మెరిగించె పీఖ్లాన - వరలక్ష్మణ ప్రభు -
చరణములకూ | జయ

5 గురుతుగా ఓంకార - గురుపీఠ సిద్ధాంత - పరమతత్వార్థము - భక్తుల
కును - కరుణతో బోధించి - కడతేర్చినటువంటి - వర వెంకటేశ్వర -
గురునకిపుడూ | జయ

6 ఒరుగల్లు పురమందు - గిరుమాజిపేటలో - గురు మందిరంబును -
గుర్తువరచి - పరిపూర్ణ బోధను - ప్రకటించినట్టిశ్రీ - వరసేతి వేంక
టేశ్వరునకిపుడూ | జయ

7 భువిలోనపరిపూర్ణ - బోధమర్మము జెప్పి - భవనాశస్థితిలేని - బాట
జూపి - స్తవనీయ భక్తులను - దరిజేర్చినటువంటి-ద్విజుండుఅగయ్య
దేశికునకూ | జయ

8 వరశివానగరితో - భక్తానందాశ్రమమున - పరిపూర్ణ బోధను -
భద్రపరచి - పరమభక్తులకెల్ల - జన్మ కర్మలుబాపె - వరదేవమాంబ
చరణములకూ | జయ

ఇది భక్తానంద

తూడి దేవమాంబగారిచే రచియింపబడిన భక్తానంద తత్వములు పాటలు

—సంపూర్ణం—

శ్రీ సద్గురుచరణారవిందార్పణమస్తు

• జై శ్రీ సద్గురు పూర్ణానంద అగయార్య ప్రభు మహారాజ్ కీ జై •

౦ ఓం ౦

శ్రీనిజగురువేన్నమః

## శ్రీ సద్గురు భక్తానంద తూడి దేవమాంబ
మాతాజీ గారికి

## భక్తులు అర్పించిన

### పంచ రత్నములు

1 సీ॥ పరిపూర్ణ భావంబు భ్రిమవీడ దయనొప్ప
భక్తులకును జెప్పు వరము సుకృత
ఆత్మ సన్యాసంబు నరయంగ మదివీ్రిల
జర్చించు శిష్యుల జన్మ రహిత
సర్వమత సిద్ధాంత ఆద్యంత మంతెరిగి
అంతట నిండున్న ఆత్మ రహిత
ఆకార రహితున్కి నిరాకార నిమిషత్వ
నిర్జరుల నిదాన సత్యచరిత
గీ॥ నిరత నిరవయ సద్ధర్మ నిజగురువుల
నిత్య సన్మాన పూజిత నిర్వికార
భక్తానందా శ్రిమాధ్యక్ష శివరామ దీక్షబోధా
ఆత్మసుజ్ఞాన గురు దేవమాంబమూర్తి ।

2 సీ॥ తనుమనో ధనము ల త్యాగాభి డిజ్ఞవౌ
గురుపుత్రి కూర మేర్పరిచి తీవు
వరంగల్ పురమందు పరమొందె గురుడనుచు
వర శివనగర్న పీఠ మేర్పచితీవు

పీఠ సద్గ్రంథముల్ తెప్పించి యవియెల్ల
కూరంబు యశమొంద పఠన జేయించితీవు
భారతావనివంటి భాగంసుభాషిణివై
భక్తుల మనమున రంజిల్లి తీవు

గీ॥ యతుల బుధదేవు సత్కవుల్ నుతుపోవు
మహిని స్థిరమీవు పరమవై రావుపోవు
నిరత నిరవయ భక్తానందాశ్రమాధ్యక్షమాత
తూడి దేవమాంబరో మీ కిదే వందనములు।

3 సీ॥ అజ్ఞాన వృత్తుల నణచు బంగరుతల్లి
పరమామృత మొసగు పాలవెల్లి
పూర్వ సుకృతపూర్ణ పూజిత భువనేత
పరమపుష్కరఖండ పారుజాత
దివ్యయసద్యోత ద్విజిత జగన్మాత
యాద్యంతములు లేని యమల చరిత
భక్తుల దరిజేర్చు పరధర్మముల ప్రోవు
దయబోధించు యమృతాందసుల గోవు

గీ॥ భక్తజనముల దీవించు భక్తానంద దీక్ష
పూర్ణ బ్రహ్మ విద్యాదాన పూత చరిత
భక్తనందా శ్రమాధ్యక్ష సద్గురుమూర్తివమ్మ
భక్తినొసగుచునుంటి మీ కిదే వందనములు।

4 ఉ॥ పూర్ణత ఆగయార్యగురు పూజిత పుష్కరమౌ వరంబునన్
చూర్ణముగాక దుర్గుణము సున్నని నిర్గుణమందితీవు సం
పూర్ణత సద్గురాశ్రయము పూర్తిగ పూనిన పుణ్యదేవివై
పూర్ణవతంస నిర్మల భక్తనందవు దేవమాంబరో।

5 సీ॥ ఆత్మ సాక్షాత్కార మయ్యెనంచానం
యతిశయాంకార మద్వైత బోధ
జపతప నియమముల్ జరుపుచుంటి ననే న
హంబ్రహ్మాస్మియ నాత్మబోధ
జీవ బ్రహ్మైక్యాను భావంబు గల్గంగ
యోగసాధను డను యోగబోద
తారక బ్రహ్మంబు తరచి గ్రహించంగ
తానునే ననునది తత్వబోధ

గీ॥ సచ్చిదానంద బోధల నారితేరి మహిమలన్నిటి
చూపుచు దేవునమ్మనంగ యెలమి శివ
రామదీక్షిత అచలబోధ బడసియువి రోసిరమ్మ
అమ్మ! భక్తానందా గురు దేవమాంబ
భక్తినొసగుచు నుంటి మీకివే వందనములు।

## పూజపాట

(శ్రీ గురుచరణామె గంటిని – అనుమాదిరి)

1 మాతా సద్గురు పూజ శాయరే । పాతాకములనెల్ల బాయరే । ధాతా వ్రాసిన వ్రాతస్ । తీసె నిజ గురు మాతన్ । సతతాము మదిలోన నిల్పరే । మతినీ నిలకడ జేసి వేడరే । మాతా

2 ముక్తిప్రదాయిని మాతనూ । భక్తానంద దేవమాంబనూ । శక్తి ద్వయములుబాపి । ముక్తినిచ్చినమాత ఆ । శక్తితో మదిలోన నిల్పరే । భక్తితో పూజలు శాయరే। మాతా

3 దొంగా గుర్వుల ఖండితాత్మినీ సంగా స్వరూప సద్గుర్విణీ । బంగారు సింహాసనంబూన నిల్పియు । రంగూగ పాధ్యార్ఘ్య మీయరే । భంగాపరచు మా ఖర్మానరే। మాతా

4 ఆచమ్యములనిచ్చి వేడరే । సాచాసద్గురు బోధ నందరే । వాచారహి
తముపరచె సూచాన మదిదెల్పి । నీచాయెరుకను దీసె మాతకూ ।
పూచీ తను మన ధనము లీయరే । మాతా

5 సంచీ తాగమూల నాసినీ । కొంచా మనక పూజల్ శాయరే । పం
చామృతస్నాన మింపూగా జేయించి । సంచీ తాగమూల వీడరే ।
వంచాన రహితులై యుండరే । మాతా

6 పద్దూ మీరక మాతన్ వేడరే । శుద్ధోదక స్నాన మీయరే । వద్దికతో
గురుశుద్ధైన పలుకుల । ముద్దాగ మీరిక వీనరే న । శ్రద్ధావరణ్యా
పాల్ జేయరే । మాతా

7 కలలేని అనిమిష గురుమాతనూ । విలువా వస్త్రములిచ్చి వేడరే ।
కలనెడబాపి మనచల నాములను బాపె । విపులాత్రి శక్త్యాత్మ సద్గు
ర్వీణి । అలశేషాచలమున లేని దేవినీ । మాతా

8 సౌంజ్ఞానందగ జేసె మాతనూ । అజ్ఞా మీరక మీరల్ వేడరే । వ్రి
జ్ఞానతీత సద్గురు మాత కిప్పూడు । యజ్ఞోపవీతాము నీయరే । సుజ్ఞా
నామిమ్మని మీరల్ వేడరే । మాతా

9 పార వారముబాపె మాతనూ । తారా హారమువేసి వేడరే । నారీ
మణి యనుచూను । నెదలోన తలచక । సారా మెరిగిన సుమాతనూ
సూరీ భూషనులంతాను వేడరే । మాతా

10 అందీ అందయున్న మాతనూ । గంధా మక్షతపూజా చేయరే ।
బంధా మోక్షము బాపి । ద్వందా రహితము జేసి । మందా బుద్ధులు
మాన్పె గుర్వీణి । నిందాస్తుతుల జెందని నిస్సంగినీ । మాతా

11 జాజీ మల్లెల పూజ శాయరే । హాజారై గురు చెంతనుండరే । భా
ధ్యా భాధ్యములేని బీజా రహితము దెల్పి । బోధ్యా బోధినిస ద్గుర్వీణీ ।
ఆద్యంతారహిత అశరీరిణీ । మాతా

12 రూపా రహితముదెల్పె మాతనూ । ధూపా దీపము లిచ్చి వేడరే ।
రేపూమాపనకుండ ఆపోజ్యోతిని యిపుడు । పాపుగగురుకర్పణానరే ।
పాపారహితము జేయ వేడరే । మాతా

13 సావధాన సద్గురు మాతమా । నైవేద్యములనిచ్చి వేడరే । భావాభా
వము దెల్పి నావారీతిగ మనల । నావాల జేర్చిన మాతకూ । భావా
రహితమె తాంబూలమూ । మాతా

14 చుట్టూ తిరిగి వందన మీయరే । ఓట్టాలె గురుజేరి వేడరే । అట్టి
దిట్టిది యనరానీ గుట్టును దెల్పి । పట్టానొంగిన దేవ మాంబనూ ।
బట్టబయలౌ పరిపూర్ణాంబనూ । మాతా

15 అహం సోహం కర్పూరారతీ । ఊహా విడచి మీరలీయరే । నేహం
నాస్తికించ నమస్కా సద్గురు మాతకు । బాహాటముగ మంగళారతీ ।
మాహామహురాలకు జయిహారతీ । మాతా

16 గురుపాద తీర్థాము గ్రోలరే । గురు శేషముడిపొంది మనరే । నర
మాత్రురాలని నెదలోన దలచక । సురస మానినిగ నెంచరే । గురు
భక్తానందాశ్రమ గుర్విణీ । మాతా

17 యింగీత మిచ్చే గురు మాతనూ । వంగిమీరల్ పుజా వేయరే ।
రంగూగ వరంగల్ పురమందు వెలసెని । న్పంగి తూడి దేవమాంబకూ
పొంగూచు చెన్న స్వామి పూజలూ । మాతా

## సాష్టాంగ నమస్కారములు

1 శ్రీకరంబగు పూర్ణబోధ । ప్రభాకరుండౌ మాతరో
మకరాంకజనకుని బోధ నొం । ద్యకళంకివౌ దేవాంబరో
ఏకతత్వపు బోధ రూపిణి । నేక తత్వారహితవూ
ఉదయమున మీ పదద్వయములు । మదిని గొల్చెద మాతరో ।

2 చేటుపాటుల రెంటినొందక । వాటనాయక రహితవూ
మేటి సద్గురు ఆగయార్యుల । బాట నెరిగిన ధీరవూ
సూటి భక్తానంద దీక్షకు । వాటమౌ మాజసనిరో । ఉదయ

3 శాస్త్రి జేసిక్షరాక్షరంబుల । నాస్తి జేసిన గుర్విణీ
విస్తరించి వివేకమిచ్చి । వస్తుతత్వము దెల్పినా
అస్తిభాతి ప్రియాదిరహితరో । వస్తి మీదరి సేవకై । ఉదయ

4 యెంచిచూడగ సూర్యరస్మికి । మంచుబిందువ విచ్చునూ
మంచితనమున మాయగుణములు । దుంచివేసిన జననిరో
పంచవింశతి లక్షణంబుల । పెంచిద్రుంచిన గుర్విణీ । ఉదయ

5 పర్వతంబది విసనకర్రకు । చెర్వితంబది జెందునా
సర్వద్వంద్వ వినిర్ముక్తషు । సర్వనంద వివర్జితా
సర్వమహిమల మూలమౌయిా ॥ నిర్విశేషహ వర్జితా । ఉదయ

6 యెండమావుల జగద్భ్రమనిక । చెండె నిజగురు మాతరో
వెండిముత్యపు చిప్పలందువ । షండు విధమున జగమనీ
ఖండితంబుగ రెండులేనిది । వుండజూపిన జననిరో । ఉదయ

7 సధ్యోతముచె ఖద్యోతమెన్నడు । ఘాతమెుందని విధమునా
మధ్యపుట్టిన మాయయెరుకిది । తథ్యమగునా గుర్విణీ
ఖాద్యబాద్యము లేక యుండిన । భోద్య బోధక రూపిణీ । ఉదయ

8 పశ్చిమాంతర వాసినీ । గురుదేవునమ్మవు మాతరో
యిచ్ఛకల వరంగల్ పురమున । వచ్చిఖాయ్యే భక్తులన్
స్వచ్ఛముగ దీవించె భక్తానం । దాశ్రిమ మాతరో । ఉదయ

(అమ్మనుచూడాలనివుంది – అనుమాదిరి)

1 కరుణాకరరావా – దేవా । కరుణా
శరణాగతుడవని – నిన్ను నామది – నిజముగ నిమ్మితిరా । దేవా

2 వినరావా నా మనవి – కనరావా నా దుస్థితినీ
కలిమాయలోబడి – నిన్నునా మది – కానగనైతినిగా । దేవా

3 ఎన్నో జన్మాలెత్తి – నిసుగానక పొరపాటైతి
అజ్ఞానమున నిటు – నటు నెదిరుగుచు – కాలముగడిపితిదేవా । ఒకరు

4 యిహ సౌఖ్యము స్థిర మనుకొనినే - నీ భక్తుల చెంతను జేరి
అహంకారమును - విడనాడి - గానము జేయగనైతినిగా । దేవా

5 దరిగానక శోకాంబుధిలో - బడి వెదకుచునున్న నాపై
కరుణించి సద్గురు దేవమాంబ - స్వామిని కావగరావా
చెన్న స్వామిని కావగరావా । ఓ కరుణా

ఉ॥ నేరము లేమియున్ సెరుగ - కారణమేమిటో నన్నుగావ నీ
దారుణమైన సాగరము - దాటగ జేయుము భక్తనంద నా
మొరవినవేల నిన్ను - కొలుచుచునుంటిని గావుమంచు నీ
చరణమునమ్మియుంటి - నను చుల్కన చూడకు దేవమాంబరో ।

(అమ్మా యని పిలచినా—అనుమాదిరి)

అమ్మాయని వేడినా - ఆలకించ వేమమ్మ
యిమ్మయిలో నన్ను గావ భారమేమి తెలుపవమ్మ । అమ్మా

1 యిల్లువాకిలి నాదనుచు - కలజగమునంత నమ్మి
యుల్లములో నహము చేత - నిన్ను మరచి యుంటివమ్మ
కలసంసారంబునాది - నాదియన్న వాన్ని దెలుపవమ్మ । అమ్మా

2 నిత్యము దేహంబని నే - నెరనమ్మి యుంటి నమ్మ
అంతుదెలియ లేకనే - నే యటంచు పలికితమ్మ
సత్యముగా నేనెవరో - నిక్కముగా తెలుపుటకు । అమ్మా

3 శమదమము శాంతినెపుడు - క్రమపద్ధతి నుంటినమ్మ
శ్రమకుదగిన ఫలమిచ్చె - క్రమము నాకు తెలుపమ్మ
ముమ్మాటికి నీ నామము - దలుపక చెడిపోతినమ్మ । అమ్మా

4 సాధన సంపత్తినంత - సమకూర్చుకుంటి నమ్మ
సాధువుల సాంగత్యము - మొదలు మరచి యుంటినమ్మ
సాధనలలోబడి మునిగిన - సారము లేదంటినమ్మ । అమ్మా

5 వాసిగశివనగరమందు - శ్రీ సద్గురు దేవమాంబ

దోసీలొగ్గిన దాసజనుల - బాధబాపె నీ పారం
దాసుడు చెన్నస్వామి - చాటుచుండె - గావుమని ।
అమ్మా! అమ్మా! అమ్మా! అమ్మా

## తత్వంగిరల్

1 అన్నన్నా నే తెల్పు పల్కుమది । నాని విచారించిన వారు । యే పలుకులు మదితా వినబోరూ । అనయంబును గురు మది విడబోరూ । లేనిపోనివాని జూడగన్గానీ నేర్పుగుండుర్రి ఘనులూ । తాననే యెరుక విడచెమునులూ । అన్న

2 సుందరమగుయీా నిజగురు బోధను - అందముతో విన్నా - వారలూ కందురు నిజమన్నా । సనాతనమాయ నిన్నృత్తన్నా । సందడిగలయీా బిందు జగం బాపర మందున లేదన్నా । సంధిదెల్పెగురు చెంత జేరు మన్నా । అన్న

3 యెందు జూచినను యేకమనక । నిర్ద్వంద్వ తీతమన్నా । అందునిది యిందర్రి జాలమన్నా । మందితోగూడి తెలియు మన్నా । పొందుగ జాగర్రత స్వప్నమునకె యిడి రంధి సుమ్మీయన్నా । జెందకిక యితర బోధలన్నా । అన్న

4 కంటి లోనియా జ్యోతిని నమ్మితె । జంట వీడదన్నా । మింటిలో అర్ధ భాగమన్నా । వింటిమిదె ప్రజ్ఞానమన్నా । కంటి మింటి రెండన్నది విడచిన । తంటాదీరువన్నా । ఇంటిలో పోరు నష్టమన్నా । అన్న

5 మెలకువ లోవల నీ యునికంతయు తలచు కలయనన్నా । మేలుకనె సూచనెరుగుమిన్నా । కలౌ నీలేమి మేల్కరన్నా । నీల తోయదా మధ్యముడౌనిన్ విడచియరుగుమన్నా । తలచనిదెభావరహితమన్నా ।

6 వాసిగాను వరశివా నగర్‌లో । దాస హృదయ వాసా । దేశికా భక్తానంద ఈశ । తీసితిరి చెన్న స్వామియాశ । కాసు కిరొరగానీ జగమెరుకలు కట్నమంటినీశా । భవత్ కరుణకై దోసిలొగ్గితాశ । అన్న

(జననీ శివకామినీ—అనుమాదిరి)

జననీ శుభదాయినీ - జననమరణమనె జడుపుదీర్చినా । జననీ

1 అమ్మవు నీవె - అంతా నీవె - మమ్ములగన్న - జననివి నీవే
మమ్ములనెపుడూ - వరుగులపెట్టెటి - సెమ్మదిబ్రమలను - తీసివేసినా ।

2 క్షణబంగురమీ - దేహంబనుచూ - అక్షరములకు - ఆవలిదనుచూ
క్షరాక్షరములు - అంతామాయని - అక్షరములుపదిరెండు తెలిపినా ।

3 సృష్టివినీవె - లయమును నీవె - సృష్టికిమూల - కాంతవునీవె
కష్టమనక - బోదించితివమ్మా - స్పష్టముగను పదియారుదెలిపినా ।

4 అక్షరములువది - బైదుజూపినా - చక్షువుకందని - దానినిజూపినా
లక్షణములను - దిద్ధితీర్చినా - మోక్షము కొరకు - బ్రమ వలదనినా ।

5 వాసిగశివనగ - రంబునందువా - దేశికనిజగురు - దేవమాంబరో
దాసుడయీ.... చెన్నస్వామినీ - దోషరహితునిగ - జేసిన మాతా ।

ఉ॥ కొందరు తన్ను తాగనక । నిందలు పెట్టిరి తొందరేలనో
కొందరునిన్ను గంటిమను । దంబము చెప్పుచు చుందురేలనో
కందరు వీరలామదిని । తొందర లేనట్టిదాన్ని
అందరు నీవేయనినను । కందురు క్షణమందు నిన్ను దేవమాంబరో ।

పాట—దాదరా తాళం

1 భక్తానందమాత మీకు వందనం - నా సకలంబు నీ కర్పితం....
నీనామంబులో - మరియేమున్నదో - నినుమరువలేకున్నానమ్మా ।

2 మముమేల్కొల్ప దయజేసినా - జన్మ కడతెర జూపించి - నా -ఆ
ద్వాదశీ షోడశీ మంత్రమహిమంబులా - పంచదశి చేత జూపించినా ।

3 ప్రతిరోజంత నీనామమే - మది సతతంబు నీ స్మరణమే
మితము నేదప్పక మనసులో వేడితీ - చింత లెరుగని బోధిచ్చినా । భ

4 నినునమ్మిన వారికెపుడు - మిన్ను లేదనుచునె పొగడుదూ
అమ్మనీనూజను నిన్ను నేనెరుగగా - జన్మరాదురాదని తెలిసితీ । భ

5 వాసిగశివ నగరమందునా _ దేశికమాత శ్రీ దేవమాంబ
వాదఖేదంబులా తీసివేసె భీమ - దాసు భవబంధముల దెంచినా | భ

హిందుస్తానీ తోడిరాగం _ దాదరాతాళం

1 నేనెంత మోసపోతి _ నేనెవడ నెరుగనైతి
నేను మేనుల రెంటి సంగతి - నెరుగక చెడిపోతి | నేనెంత
2 యిల్లుసంసారంబు నాదని - యెంతో మురియుచుంటి నే
వెళ్లిపోయేనాడు భార్య - పిల్లలు రారనికంటి | నేనెంత
3 కావరమున సాధువుల - చెంత జేరనైతి నే
దేవతలని పెద్దలగని - సేవించక చెడితి | నేనెంత
4 ఎన్నరాని జన్మలెత్తి - వెతలనొందుచుంటి నే
కన్నగురుని చెంతజేరి - కీలుదెలియకుంటి | నేనెంత
5 ఈ మాయజగం బనగవిని _ మాయలోనమునిగి
ఈ మాయనయ్యా - జనన మరణ - మందుచుంటి తిరిగి | నేనెంత
6 ధరనుతూడి దేవమాంబ _ అచలబోధ వినగా
నాబాధలన్నిపోయె _ భీమదాసుడన్న మాటవినక | నేనెంత

(నీవుండెదా కొండ పై—అనుమాదిరి)

1 నీ విందురావేలరా _ నా దేవ - దేవ దేవుడవీవెరా
భవభయంబుల బాపరా _ నా దేవ - బట్టబయులను జూపరా | నీ
2 రకరకంబుల పూవులూ - నా దేవ _ రయమున కోసితెచ్చి
అకలంకమునగను గూర్చి - నా దేవ - హారములు మెడనేతురా | నీ
3 పునుగు జవ్వాజియును - పన్నీరు _ బుక్కా గులాలు జల్లి
మనుసార పాదములను - నా దేవ - చిత్తము లో పూజింతురా | నీ
4 పంచాభక్షంబునూ - నా దేవ - పాలాతొ నర్పించితీ
గాంచి సంచిత కర్మలా _ నా దేవ _ దుగ్ధించినను రక్షించరా | నీ
5 వాసిగ శివగరిలో _ శ్రీభక్త - నందమందిర మందునా
దేశిక దేవమాంబా - భీమయ్యా - దాసూని దరిచేర్పినా | నీ

## మంగళహారతులు

### శంకరాభరణం—ఆదితాళం

1 కర్పూర హారతి నివ్వరమ్మ । భక్తానంద దేవాంబను । నేర్పుతో కోరి కొలువరమ్మ । కర్పూర

2 పడతులందారు గుమిగూడి । యామహాదేవిని పలుమారు । బహు పూజ జేయుగా । ద్వాదశి షోడశి । ద్వయ మంత్రంబులు । బోధించగ నా బాధలు బాసెను । కర్పూర

3 పరమ పవిత్రాలు మాయమ్మ । సంశయము లేక వినయంబుతోడా దెలిపెనమ్మ । వాదభేదములు లేనిబోధకు । యెరుకలేదుయని పాడుగ దెలిపిరి । కర్పూ

4 మూలాములేని దేహమమ్మ ! మొదటికి లేదనుచు చాలగ బోధించె మాయమ్మ । కలదోచిన దేహములేలాగో । అలాగని పలువిధములు దెల్పెగురు ॥

5 యిలలో పావయ్యవల్లెయందు । వెలసిన భక్త దేవాంబను కోరి కొలువరమ్మ ॥ వాసిగాను శివనగరమందునా । దాసులనేలెటి దేవయాఖ్యకు ॥

6 వాసిగ పాలంపేటయందు । నివాసంబైన దాసూల గాచిబ్రోవవమ్మ యిలలో పిల్లలమరిత్రీమయును । కరుణతోడకడ తేర్చినయమ్మ॥ క

### బీహాగ్ - కైరువా

1 హారతి గురుమూర్తినిలయా । ఘొరకర్మను దుంచికదేవా । యేరి మీసరి వారుజగమున । లేరులేరని వింటినీ । యేరా । వొధీరా । ననూగావుముదేవా ॥ హారి

2 యెక్కడెక్కడ వెదకిన నాకు దిక్కులేదని యంటిరీ । చక్కగను నా రహితబయలు । జాడదెలియు మంటిరీ । సారా । విచారా । నను గావుముదేవా ॥ హార

3 నేనునీవనియనక నంతట । నిండినాదని యంటిరీ యిదియెవరిపూర్ణం.
బటంచు । యింపుగా వినుమంటిరీ । యిందు । యెవరన్న ।కాదన్న
నను గావు ॥

4 ముందుగను ద్వాదశియు దెలిపి । సందియము వీడంటిరీ । రెండవది
షోడశిని దెలిపి । యెరుకలేదని యంటిరి । నంద । భక్తనంద । నను
గావుము దేవా ॥

5 వాసిగను శివనగురు భక్త । మందిరములో యుంటిరీ । భాసురంబుగ
భీమదాసు వ్రాసె మంగళహారతీ। దాసానదాసూలకెల్ల దాసుడను ॥

ఆటతాళం.

హారతిదే గొనుమా । అచలగురుమాతా ॥ హార

1 హారతిదేగొనూ । ధీరనిర్గుణా సాంద్రా । పూర్ణనందూని ప్రతి ।
తూడీ శ్రీ దేవామాంబరో ॥ హార

2 సాధ్యసాధ్యాముగానీ । సాధించె అచలామాని । బోధించీ యెరుకను
తీస్తిరి । భక్తానందామాతనొ । హార

3 ద్వాదాసల్లదిగోచూడని । షోడసీవిడపూమనుచూ । పదియైదూ
తోడుజేసీ । సదమాల స్థితినీ జూపిరి ।। హార

4 కలవంటిది కర్పూరం । మేల్కాంటిది అనలామమ్మా । యీయా
రెండూ కలసీ । పూర్ణా పళ్లెరమున వెల్గెను ॥ హార

5 కారాణగురుపూజ్యాలు । వాదపల్లాగయ్యార్యుచె । ఘొరభవాబ్ధిని
దాటి । ఆరీతి మమ్మేలిన తల్లీ ॥ హార

6 వారంగల్‌పురమూనందూ । భక్తానందా శ్రీమందూ । ఏరంగులులేనీ
పరములా । సారందెల్పిన మాతరో ॥ హార

7 కవ్వావిన్నాదీ నున్నని । చెన్నస్వామీకి దెల్పి । అన్నా యీ
మాయాయెరుకను । సున్నా చెయ్యనుచూ దెల్పిరి ॥ హార

—శ్రీ సద్గురుచరణార విందార్పణమస్తు—

* భక్తానంద మహారాజ్ కీ జై *



గ్రంథములు వలయువారు-

భక్తానంద ఆశ్రమము
ఇంటి నెం. 16/1130 శివనగర్,
వరంగల్ - ఆం. ప్ర. 506002.

మయూరి ప్రింటింగ్ ప్రెస్ విజయ టాకీసురోడ్, హన్మకొండ